# బెజ్జంకి దేవాలయ శిల్పవిశేషాలు



డా. ఎస్.ఎస్.ఎస్. ఆచార్య

# బెజ్జంకి

## దేవాలయ శిల్ప విశేషాలు

డా. యన్.యల్. నరసింహాచార్య
ఆంధ్రోపన్యాసకులు
ప్రభుత్వ కళాశాల - సిద్దిపేట

BEJJANKI DEVAALAYA SILPA VISESHAALU

*By Dr. N.L. Narasimha Charya*

బెజ్జంకి దేవాలయ శిల్ప విశేషాలు

డా.యన్.యల్.యన్. ఆచార్య

గాయత్రీ ప్రచురణలు - 2

ప్రథమ ముద్రణ: 1993






వెల: రూ.40/-

ప్రతులకు:

యన్. రంగనాయకమ్మ
11-115, గాంధినగర్
సిద్దిపేట - 502 103

ముద్రణ:

మాస్టర్ ప్రింటర్స్ & గ్రాఫిక్స్
4-73, రోడ్ నెం.8, హబ్సిగూడ,
హైదరాబాద్ - 500 007

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహకారంతో ముద్రింపబడినది.



సమర్పణ

శ్రీమత్

అలమేలుమంగా, పద్మావతీసమేత

వెంకటేశ్వరస్వామి

దివ్యచరణారవిందాలపై

సమర్పితం

**Dr. V.V. KRISHNA SASTRY**
M.A., Ph.D.
Retired Director
Archeaology & Museums, and
Oriental Manuscripts Library and
Research Institute

Phones: Office : 234942
: 231269
Resi : 875135
: 224260

Date ....................

# ముందుమాట

అమరావతి, నాగార్జునకొండ, గోలి, ఘంటశాల, జగ్గయ్యపేట, ధూలికట్ట మొదలయినచోట్ల వికసించిన ఆంధ్ర బౌద్ధ శిల్ప సాంప్రదాయం తరువాత క్రీస్తుశకం 11వ శతాబ్ద మధ్యకాలం నుండి 14వ శతాబ్ది పూర్వ భాగం మధ్యకాలం నాటి కాకతీయ ఆలయ శిల్పం అత్యంత అపురూపమయినది. సమకాలీనంగా చోళ, పాండ్య, హోయసల, చందేల, పాల, ప్రతీహార శిల్పరీతులకు దీటుగా ఉంటూ కాకతీయ శిల్పం ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది. మధ్యకాలీన భారతీయ శిల్పాన్ని అధ్యయనం చేయడంలో కాకతీయ శిల్పాన్ని విస్మరిస్తే ఆ అధ్యయనం అసంపూర్తే అవుతుంది. కాకతీయ, చోళ సాంప్రదాయాల సమ్మేళనం విజయనగర శిల్ప వికాసానికి విశిష్టతకు దోహదమయింది.

కాకతీయుల కాలంలో నిర్మింపబడ్డ దేవాలయాలు నేటికి 50కి పైగా నిల్చి ఉన్నప్పటికి వీటిలో ముఖ్యంగా ఎన్నతగ్గవి పాలంపేట, ఘనపురం, వేయిస్తంభాల గుడి, వరంగల్లుకోటలో ఛిన్నాభిన్నమయి ధూళి ధూసరితమయిన స్వయంభూదేవాలయము, కటాక్షపురం, రామానుజపురం, నగనూరు, మంథని, కూసుమంచి, నిడికొండ, నాగులపాడు, పిల్లలమర్రి, బెజ్జంకి మొదలయినచోట్ల ఉన్నాయి. కర్నూలు జిల్లాలోని పెదతుంబళం గ్రామంలోని జైన ఆలయం, మోటుపల్లిలోని రామాలయం, వీరభద్ర ఆలయం, తూర్పుగోదావరి జిల్లా ర్యాలిలోని మోహిని కేశవస్వామి ఆలయాలు గూడా కాకతీయ సాంప్రదాయంలో నిర్మించబడ్డాయి.

పైన చెప్పిన ఆలయాలలో కరీంనగర్‌కు సిద్దిపేటకు మధ్యలో ఉన్న బెజ్జంకి దేవాలయం తాలూకు శాసనాధారాలు లేనప్పటికి కాకతీయ నిర్మాణమేనని చెప్పటానికి సందేహంలేదు. కొన్ని కాకతీయ శాసనాలలో ఉల్లేఖితమయిన బెజవంకి లేదా బెజవంక గ్రామనామం బెజ్జంకి కొండ పూర్వ భాగంలో పాషాణ దోషంవల్లగాని వాననీటి వరవడికిగాని ఏర్పడ్డ పెద్ద బెజ్జం దానినుండి వెలికి వచ్చిన లేక ఆవిర్భవించిన ఏరు లేక వంక ఉండటం చేత బెజవంక-వంకి అనే

పేరు వాడుకలోనికి వచ్చి వుంటుంది. రానురాను అది బెజ్జంకి అయింది. అదే కొండమీద నిర్మింపబడ్డ నరసింహస్వామి ఆలయం కాకతీయ శిల్ప విన్యాణానికి విన్యాసానికి దర్పణం పడుతుంది.

కాకతీయ దేవాలయాలు మూడు రకాలుగా ఉన్నాయి. అవి ఏకకూటం, త్రికూటం, పంచకూటాలుగా నిర్మింపబడ్డవి. ములుగు తాలూకా రామానుజపురంలోని దేవాలయం ఎఱ్ఱ రాయితో నిర్మింపబడ్డ పంచకూట ఆలయం. ఇది పంచాయతన ప్రతిష్ఠకొరకు నిర్మింపబడింది. బెజ్జంకి, రామప్ప, ఝూకారం, కటాక్షపురం మొదలయినవి ఏకకూటాలు. వేయిస్తంభాలగుడి, ఘనపురం, నిడికొండ, నాగులపాడు మొదలయినవి త్రికూటాలు.

రామానుజపురంలోని పంచకూట దేవాలయ అధిష్ఠానం చాలా తక్కువ ఎత్తు ఉండటం చేతను, సమీపంలోని చెరువు యొక్క వరద మట్టానికి, పల్లపు ప్రాంతంలో ఉండటం చేతను పెద్ద వరదలు వచ్చినప్పుడల్లా ఇది నీట మునిగి పునాదులు దెబ్బతిని చాలావరకు శిథిలం అయింది. రామప్ప దేవాలయ సమీపంలోని తటాకం యొక్క దిగువ భాగంలో నిర్మించిన దేవాలయాల పరిస్థితి గూడా ఈ విధంగానే ఉన్నది. నాగులపాడు దేవాలయాలు గూడా చాలా వరకు శిథిలం అయాయి. నిడికొండ త్రికూట ఆలయం కూలి కుప్పలయింది.

ఈ లోపాన్ని సరిదిద్దడానికేనన్నట్లు తరువాత నిర్మించిన దేవాలయాలకు అధిష్ఠానం మనిషెత్తుకంటె పైగా నిర్మించబడడం జరిగింది. ఈ కాలంనాటి దేవాలయ నిర్మాణంలో మరో లోపం ఉపపీఠం క్రింద సరి అయిన పునాదులు లేకపోవడం. పొడవైన బరువైన బండరాళ్ళను చదునైన నేల మీద పఱచి ఉప పీఠాలు నిర్మించారు. వీటిపైన వానలకో వరదలకో పునాదిరాళ్ళ క్రింది మట్టి కొట్టుకు పోయి ఆవైపుగా పునాది ఒరిగి దేవాలయాన్ని కూలద్రోయడం జరిగింది.

బెజ్జంకి దేవాలయం ఎక్కువ ఎత్తులేని నల్లశానపురాతి కొండమీద నిర్మించడం చేత పై చెప్పిన లోపాలు లేవు. ఇది సర్వతోభద్ర పీఠం మీద దక్షిణ ముఖంగా నిర్మింపబడ్డది. బహుశా ఆ దిశగా పైన చెప్పిన వాగు లేక వంక ప్రవహిస్తూ వుండవచ్చు. కృష్ణా జిల్లాలో జగ్గయ్య పేటకు సమీపంలోని ప్రసిద్ధ నారసింహ క్షేత్రం వేదాద్రి, ఉత్తరవాహిని అయిన కృష్ణానదికి అభిముఖంగా నిర్మింపబడింది. వాస్తురీత్యా ఈ దేవాలయానికి ప్రాధాన్యత లేకున్నా పవిత్ర కృష్ణాతీరం ఎదురుగానున్న ఈ దేవాలయం వారణాసిలోని విశ్వేశ్వరాలయాన్ని గుర్తుకు తెస్తుంది. ఈ మహాక్షేత్రము దాని పరిసరాల ప్రభావానికి ఉత్తేజితుడయిన

నారాయణ తీర్థులు "కృష్ణలీలా తరంగిణి" ని సువర్ణ ఘంటంతో వెలువరించారు. కర్నూలు జిల్లా అహోబిలంకొండపైనున్న ఎగువనారసింహక్షేత్రంలోని మూల విరాట్టుగూడా దక్షిణాభి ముఖంగానే వేంచేశారు. దిగువ అహోబిల దేవాలయం ప్రాఙ్ముఖంగానే ఉంది.

క్రీస్తు పూర్వంనాటి శిలా నిర్మిత శివలింగాలు చిత్తూరు జిల్లా పాపానాయుడు పేట సమీపంలోని గుడి మల్లం అనే గ్రామంలోను మరొక రెండుచోట్ల కనుపిస్తాయి కాని అంత ప్రాచీన వైష్ణవ విగ్రహాల ఉనికి నేటివరకు తెలియరాలేదు. నేటి వరకు ఆంధ్రలో లభించిన అతి ప్రాచీన వైష్ణవ విగ్రహం నల్గొండ జిల్లా ఏలేశ్వరం త్రవ్వకాలలో లభించింది. రెండు చేతులుగల ఈ విగ్రహం దాచేపల్లి పాలరాతి మీద మలచబడింది. ఇది రమారమి క్రీ.శ. 2-3 శతాబ్దాలనాటిది ఇంతకు మునుపు గూడ వైష్ణవ విగ్రహాలు ఉండి ఉండవచ్చుగాని అవి దారు నిర్మితాలయి వుంటాయి. నాగార్జున కొండలోని అష్టభుజ నారాయణుని విగ్రహం దారు నిర్మితం కావడం చేత జాడ తెలియకుండా పోయింది. గుంటూరు జిల్లాలో కొండమోటు అనే గ్రామ శివార్లలోని చిన్నకొండ మీద ఒక ప్రాచీన పంచవీరుల ఫలకం దొరికింది. పూర్తిగా సింహాకృతిలో ఉండి ఊర్ధ్వరేతస్కుడయిన నారసింహుడు పంచవీరుల మధ్యగా అర్ధశిల్పంగా మలచబడ్డాడు. దక్షిణ భారతదేశంలో లభ్యమయిన అతి ప్రాచీన నారసింహుని శిలారూపం ఇదే కావచ్చు. నారసింహుని కిరువైపులా సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నబలరాములే గాక కుక్కుట ధారి అయిన కార్తికేయుడుండుట చేత ఆకాలంలో శైవవైష్ణవాలకు వైషమ్యాలు లేవని నారసింహుడు (బాహువులు తప్ప) జంతురూపంలోనే ఆరాధింపబడేవాడని తెలుస్తుంది. కాలానుగతంగా నారసింహుని శరీర దిగువభాగం మానవాకృతిగాను ముఖం మాత్రం సింహరూపంగాను చూపడం సాంప్రదాయం అయింది.

గతంలో 5-6 సంవత్సరాల వెనుక నా కుమార్తె అనిలకుమారి కాకతీయ శిల్పంమీద డాక్టరేట్ చేస్తున్న సందర్భంలో బెజ్జంకి దేవాలయం చూడటం జరిగింది. అక్కడి శిల్పాలలోని గజపంక్తులు, హంసపంక్తులు, నాట్యకత్తెలు, వాద్యగాండ్రు, ఆటవికాంగనలు నన్నెంతో ఆకర్షించి ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధానికి "మానిని - మర్కటం" అనే వ్యాసాన్ని పంపడం జరిగింది. బెజ్జంకి శిల్పాలలోని ఒక సుందర యౌవనాంగికి ఒక మర్కటం వివస్త్రగావించే దృశ్యం చూశాక ఆదిశంకరులు విరచించిన శివానందలహరిలోని శ్లోకం గుర్తుకొచ్చింది.

"సదామోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశా శాఖా స్వటతి స్వైరమభితః

కపాలిన్యోభిక్షామే హృదయ కపిమత్యంత చపలం

దృఢం భక్త్యా బధ్వా భవదధీనం కురు విభో"

ఎల్లప్పుడు మోహమనే అడవిలో సంచరించే చపలమయిన నా మనస్సనే మర్కటం యువతుల కుచ గిరులపై చరిస్తోంది. అట్టి చపలమైన నా మనస్సును నీవై దృఢ భక్తి అనే తాటితో బంధించి నీ వెంట భిక్షాటనకు పోయే సమయంలో తీసుకు వెళ్ళు. నీకు ఎక్కువగా భిక్ష దొరుకుతుంది.

ఈ గ్రంథకర్త నరసింహాచార్యులు వరంగల్లు సహస్రస్తంభ దేవాలయంలో దొరికిన శిల్పాన్ని ఉటంకించారు. అది శృంగారాన్ని ఒలకపోస్తూ ఒక రమణి పండ్లు పూలు ఉన్న బుట్టను దేవాలయానికి తీసికొని పోతున్నది. ఆ బుట్టపైన ఒక చిలుక ఉన్నది. హైందవ సాంప్రదాయంలో చిలుక మన్మధుని వాహనం. ఒకప్పుడు స్త్రీ వివాహ జీవితాన్ని అయిదువతనాన్ని సూచించడానికి చిలుకను శిల్పీకరిస్తారు. పై శిల్పంలోని చిలుక ఆమె యౌవ్వనాన్ని శృంగారాపేక్షను తెలియచేస్తుంది. ఆమెను చూచి గడ్డాలు మీసాలు పెంచుకున్న మునీశ్వరుడు మోహపరవశుడయ్యాడు. అతడి పాదభాగంలో అతడి మనో గతిని సూచించేందుకు ఒక మర్కటం చూపబడింది. మునీశ్వరుని గూడా మోహింపజేయగల లావణ్యం ఆమె వద్ద కలదని సూచించడంతో శిల్పి పూర్తిగా సఫలీకృతుడయినాడని చెప్పవచ్చు. వర్ణనాత్మక Narrative శిల్ప చిత్రీకరణలో ఆంధ్రశిల్పి సిద్ధహస్తుడు.

కాకతీయ శిల్పాలలో నాగిని కొక ప్రత్యేకత ఉన్నది. నగ్న సుందరి అయిన బెజ్జంకి నాగిని భుజాలపైన పొడవైన సర్పం రెండు భుజాలనూ కలుపుతూ పుష్పహారం వలెనున్నది. కాళ్ళకు గూడా సర్పబంధమున్నది. శిల్ప ప్రకాశికలో నిర్దేశించిన పదియారు అలసకన్యలలో ఈమె ఒకతి కావచ్చు. కామసూత్రాలలోని నాగబంధం అనే రతిక్రీడాపద్ధతిలో ఆమెనిష్ణాతురాలని చెప్పడానికో, ఈమె కామశాస్త్రోపాధ్యాయని అని చెప్పడానికో ఈ శిల్పసృష్టిజరిగి ఉంటుంది. ధర్మార్థమోక్షాలతో పాటు కామపురుషార్థానికి దేవాలయాలు నిలయాలైనప్పుడు పై ఊహ తప్పు కాకపోవచ్చును. నాటి భోగినులు నేటి వేశ్యలవలె రోగ భూయిష్ఠలుకారు. కామశాస్త్రకోవిదలు కామకళాకారులు.

మగనాగు ఆడునాగు రత్యారంభానికి ముందు మోహావివశులై ఒకదానికి మరొకటి చుట్టుకొని పడగలు విప్పుకుంటూ ఉవ్వెత్తు లేస్తూ పడ్తూ కాలగమనాన్ని, తమపరిసరాలని మరచి రతిక్రీడలో నిమగ్నమవుతున్నాయి. మానవ స్త్రీ అదే విధమయిన అనురాగం ఆప్యాయతలతో వర్ధిల్లి పిల్లాపాపలతో చల్లగా వుండాలని నాగ ప్రతిష్ఠలు, నాగపూజలు జరపడం ఆచారమయింది. పాములంటే భయంచేత హిందువులు వాటిని పూజిస్తారనే ఫెర్గుసన్ వంటి పాశ్చాత్య

చరిత్రకారుల అభిప్రాయం సరి అయిందికాదు. భయంచేత పూజలు చేస్తే తేళ్ళకు, పులులకు, తోడేళ్ళకు, చిరుతలకూ పూజలు చేయాలి కదా!

పురాణాలలో చెప్పబడ్డ భగవత్పరమైన గాధలను కంటికి ఎదురుగా ప్రత్యక్ష పరచడమే దేవాలయశిల్పాల పరమోద్దేశం. అర్ధంగాని భాషలో రచింపబడ్డ పురాణాల ముఖ్య ఘట్టాలను పామరులకు తెలియజెప్పాలంటే ఇంతకంటే సులభమైన మార్గం ఏముంది? నేడు వీటి అధ్యయనం వల్ల ఆయాకాలాల నాటి ఆభరణాలు, దుస్తులు, నాట్యరీతులు, వాద్యవిశేషాలు, సాంఘిక పరిస్థితులు మొదలయినవి ఎన్నో తెలుస్తాయి.

డా.ఎన్.ఎల్. నరసింహాచార్యగారు రచించిన ఈ పుస్తకంలో బెజ్జంకి దేవాలయ వాస్తువును శిల్పాన్ని శ్రద్ధగానూ విపులంగాను పరిశోధించారు. ఒక పర్యాటకుడు ఈ పుస్తకం చేత పట్టుకొని బెజ్జంకి దేవాలయంలోని ప్రతి అంశాన్ని అర్ధంచేసికొనవచ్చు. దూరంనుండి చూచినప్పుడు దేవాలయ స్థూలస్వరూపము దగ్గరవుతున్న కొద్ది ముఖ్యాంగాలయిన అధిష్ఠానం ప్రదక్షిణపథం, దేవకోష్ఠనిర్మాణరీతులు లోనికి ప్రవేశించేటప్పుడు అగుపించే ద్వారనిర్మాణం కక్షాసనాలు రంగ మండప స్తంభ శిల్పాకృతులు, లోకప్పు అలంకారాలు మొదలయిన వివరాలు సరళశైలిలో పోలికలు చూపుకుంటూ అవసరమనుకున్న చోట ప్రమాణ గ్రంథాలనుండి సంబంధిత వాక్యాలని ఎత్తిచూపుతూ శిల్ప శాస్త్ర అధ్యయనానికి తన భాషాప్రావీణ్యాన్ని రంగరించి తన ప్రత్యేకతను చాటుకునే ఒక క్రొత్తరీతిలో ఈ పుస్తకాన్ని మనకందించారు. నేటి వాడుకలో చెప్పాలంటే బెజ్జంకి దేవాలయం మీద ఈ చిన్న పొత్త మొక పొందైన డాక్యుమెంటరీ చలనచిత్రం. ఆంధ్ర సంస్కృత భాషల్లో ప్రవీణులైన నరసింహాచార్యగారు కాకతీయశాసన భాషా పరిశీలనలో డాక్టరేట్ పట్టా పొంది దేవాలయ వాస్తువు శిల్ప శాస్త్ర అధ్యయనం కొంగ్రొత్తగా చేపట్టినా ఈ పుస్తకంలో పూర్తిగా సఫలీకృతులయ్యారని చెప్పడం ఉత్ప్రేక్షకాదు. వారికి నా హృదయపూర్వక అభినందనలు. ప్రతి ముఖ్యమైన ప్రాచీన కట్టడాల పయిన ఇటువంటి ఏక వస్తురచనల అవసరం ఎంతయినా వున్నది. భవిష్యత్తులో ఇటువంటి రచనలు మరిన్ని చేస్తారని ఆశిస్తున్నాను.

వి.వి. కృష్ణశాస్త్రి

**Prof. K. Subrahmanyam**
Joint Director

*Commissionarate of*
*Higher Education*
*A.P. Hyderabad.*

## అభినందనలు

డా. యన్.యల్. నరసింహాచార్యగారు, బెజ్జంకి దేవాలయ శిల్ప విశేషాల గురించి వ్రాసిన ఈ చిన్న పుస్తకం మన చరిత్ర, సంస్కృతి పట్ల అభిరుచి వున్న వారందరికి ఉపయోగపడుతుంది.

హైదరాబాదుకు సుమారు 125 కి.మీ. దూరంలో వున్న బెజ్జంకి చారిత్రక, సాంస్కృతిక, ప్రాశస్త్యాన్ని గురించి తెలియజేసే ఈ పుస్తకం చిన్నదైనా చాలా విలువైంది. అన్ని గ్రంథాలయాలలో వుండదగిన పుస్తకమిది. అందరికీ తెలియని అనేక విషయాలను ఈ పుస్తకంలో పొందుపరచి, బెజ్జంకి ప్రాముఖ్యతను వెలికి తీసిన శ్రీ నరసింహాచార్య అభినందనీయులు.

శిల్పకళను గురించి సులభ శైలిలో వ్రాయడం చాలా కష్టమైన పని. అయితే ఈ పుస్తకం చదువుతుంటే సామాన్య ప్రజానీకం కూడా శిల్పకళను గురించి సులభంగా తెలుసుకోవచ్చనే అభిప్రాయం ఏర్పడుతుంది. ఇటువంటి అందరికీ అర్థమయ్యే పుస్తకాలు, మన శిల్పకళ ప్రాశస్త్యాన్ని గురించి సామాన్య ప్రజానీకానికి చాటి చెప్పడానికి అవసరం.

కాకతీయుల నాటి బెజ్జంకిలోని లక్ష్మీనరసింహ స్వామి దేవాలయం కొన్ని విషయాల్లో రామప్ప దేవాలయాన్ని పోలి వుందని, రచయిత సాక్ష్యాధారాలతో వివరించి, బెజ్జంకి దేవాలయం ప్రాముఖ్యతను పెంచారు.

దేవాలయాలు ఆరాధన ప్రదేశాలే కాదు. అవి మన జాతి సంస్కృతికి నిలయాలు. దేవాలయాల పై జరిపే పరిశోధన, మన పూర్వ సంస్కృతిని గురించి తెలుసుకోడానికి ఉపయోగపడుతుంది. కాకతీయులు శైవులయినప్పటికీ, వైష్ణవాలయాలను నిర్మించి తమ విశాల మతదృక్పథాన్ని ఋజువు చేసుకున్నారని రచయిత వివరించారు. ఇటువంటి ఆసక్తిదాయకమైన విషయాలను గురించి పరిశోధన చేసి, పుస్తక రూపంలో అందరికీ తెలియజేయడానికి ప్రయత్నించిన శ్రీ నరసింహాచార్యుల గారి కృషి శ్లాఘనీయం.

హైదరాబాద్. | కె. సుబ్రహ్మణ్యం

# కృతజ్ఞతాభివందనలు

ఆధ్యాత్మిక భావనకు కేంద్రమైనవి దేవాలయాలు. వాటిని సర్వ కళానిలయాలుగా మలుస్తూ ఆముష్మికంతో పాటు ఐహికాన్ని కూడ అందించినవారు మన భారతీయులు. దేవాలయం భక్తుల పిపాసను తీర్చింది. అన్నార్తుల ఆకలి మంటను తగ్గించింది. జ్ఞానార్తుల విజ్ఞాన తృష్ణను తీర్చింది. అంగరంగ భోగాదులపేరుతో కళాకారులకు, వేద, వేదాంగ విద్వాంసులకు, అర్చకులకు, పరిచారకులకు, పనిపాటల వారికి ఇంకా చాలమందికి ఉపాధి కల్పించింది. "రాజుల సొమ్ము రాళ్ళ పాలు" అనే సామెత ఆధ్యాత్మిక భావనతో, కళాతృష్ణతో దేవాలయాదులను నిర్మించిన రాజులనుద్దేశించి భౌతిక దృక్పథంవల్ల వచ్చింది. చక్రవర్తులైనా, రాజులైనా, వారి సామంతులైనా, ధనవంతులైనా, ప్రజా సామాన్యమైనా దేవాలయనిర్మాణం, దాని నిర్వాహణ ఉత్తమోత్తమ కార్యంగా, అత్యంత పుణ్యప్రదమైన కర్మగా మన పూర్వులు భావించారు. ఉత్తమ కార్యనిర్వాహణే వారి ప్రధానాశయం. కీర్తి ప్రతిష్ఠలు వారికంతగా అవసరంలేదు. వాటికై వెంపర్లాడలేదు కూడ. వారు ఎంతగొప్ప దేవాలయాన్ని సుందరశిల్ప విరాజితమైన ఆలయాన్ని నిర్మించినా ఆ దేవాలయ శిలలపై తమ పేరును, కాలాన్ని, ఇతరవివరాలను ఎక్కడా పొందుపరచలేదు. కనీసం వాటి స్థపతులైనా తమ పేర్లు వగైరాలను ఎక్కడా పేర్కొనలేదు. అందువల్లనే ఆ దేవాలయాల గురించి తరువాతివారు తమ ఊహాపోహలతో రకరకాల స్థలపురాణాలు సృష్టించారు. అదీ భగవంతుని మాహాత్మ్యాన్ని వివరించటానికే కాని చరిత్ర కొరకు కాదు.

అటువంటి ప్రాచీన దేవాలయాల్లో కరీంనగర్ జిల్లాలోని బెజ్జంకి దేవాలయం ఒకటి. చక్కని, చిక్కని శిల్పమున్నా పట్టించుకొనేవారు లేరు. కొన్నిటి ముఖాలు చెడిపోయినాయి. కొన్ని శిల్పాల ముక్కులు విరిగిపోయినాయి. చేతులు, వాటిలోని ఆయుధాలు విరిగిన శిల్పాలే ఎక్కువగా కన్పిస్తాయి. అయినా కాకతీయుల నాటి ఆ దేవాలయాన్ని గ్రామస్థులు తమ శక్తిమేరకు రక్షించుకుంటున్నారు. అది మన అదృష్టం.

ప్రాచీన శిల్పం చరిత్రపై అభిరుచి కల శ్రీ వేముగంటి రఘునాథాచార్యుల ప్రేరణ వల్ల బెజ్జంకి వెళ్ళాను. అక్కడి శిల్పం ముఖ్యంగా స్తంభ శిల్పం రామప్ప శిల్పానికి ఏ మాత్రం తీసిపోదనిపించింది. కాకతీయులు, వారి సామంతులు చాలావరకు శైవులు. వారు నిర్మించిన ఆలయాలన్నీ శివాలయాలే. త్రికూటాలయాల్లో విష్ణువున్నా ప్రధాన దైవతం పరమ శివుడే. బెజ్జంకి దేవాలయం కేవలం వైష్ణవం. స్తంభ శిల్పం, ఇతర శిల్పం వైష్ణవ గాథలనే వివరిస్తాయి. అందువల్ల అక్కడి శిల్పంపై చిన్న వివరణతోనైనా ఒక పుస్తకం వెల్వరిస్తే బాగుంటుందనిపించింది. మిత్రుల ప్రోత్సాహమూ లభించింది.

ఈ కార్యక్రమంలో శ్రమ అనక, విసుగు పడక నావెంట అనేక పర్యాయాలు వచ్చి అన్ని శిల్పాల ఫొటోలను చక్కగా తీసుకోవటంలో సహకరించిన కృష్ణా ఫొటో స్టూడియోస్ అధినేత శ్రీ కిషన్‌గారికి, మిత్రులు శ్రీ హరనాథ శర్మగారికి, శ్రీ రవి కుమార్‌గారికి,

ఆగమశాస్త్ర విషయంలో ఏర్పడ్డ సందేహాలను నివారిస్తూ, తగు సలహాలిచ్చిన స్థానిక శ్రీ వెంకటేశ్వర స్వామి ఆలయం ప్రధానార్చకులు శ్రీమాన్ అమరవాది రంగాచార్యులగారికి,

ఇక్కడి శిల్పాన్ని వివరించేటప్పుడు రామప్ప, అహోబిలం మొదలైన చోట్లగల శిల్పాలతోగల పోలికలను, భేదాలను, ప్రత్యేకతలను చెప్పవలసి వచ్చింది. ఆ సందర్భంలో విజ్ఞాన సర్వస్వంలోని శ్రీశైల శిల్ప చిత్రాన్ని నా పుస్తకంలో ప్రచురించుకోవటానికి అడిగిన వెంటనే అనుమతించిన కొమర్రాజు వెంకట లక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వకేంద్రం డిప్యూటీ డైరక్టర్ డా. కె. ఆనందన్‌గారికి,

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, పురావస్తుశాఖవారు ప్రచురించిన "Ghanpur Group of Temples" మరియు "Sri Ahobila Narasimha Swamy Temple" అనే గ్రంథాలనుండి కొన్ని చిత్రాలను నా పుస్తకంలో ప్రచురించుకొనుటకు అనుమతించిన పురావస్తుశాఖ (ఆం.ప్ర.) డైరక్టర్ శ్రీ S. కాశీపాండ్యన్ I.A.S.గారికి,

తాము చాలా శ్రమించి, తిరిగి విషయసేకరణ చేసి ప్రచురించిన "కాకతీయ శిల్పం"లోని రామప్ప శిల్పాలను ప్రచురించుకొనుటకు అనుమతించిన శ్రీ చలసాని ప్రసాదరావుగారికి,

నా పుస్తకానికి 'ముందుమాట'గా తమ విలువైన అభిప్రాయాలతో అమూల్యమైన విషయాలను తెలుపుతూ తాము భద్రంగా దాచుకొన్న కొన్ని బెజ్జంకి శిల్పాల ఫోటోలను ఇచ్చిన మాన్యులు డా. కృష్ణశాస్త్రిగారికి (రిటైర్డ్ డైరక్టర్, పురావస్తు శాఖ, ఆం.ప్ర.),

తమ కార్యాలయ పనుల వత్తిడి ఎంత వున్నా సహృదయతతో నా పుస్తకాన్ని చదివి అభినందనలు అందచేసిన ఆచార్య కె. సుబ్రహ్మణ్యం గారికి (జాయింట్ డైరక్టర్, ఉన్నత విద్యాశాఖ,ఆం.ప్ర.),

**నా హృదయపూర్వక కృతజ్ఞతలు.**

అన్నీ ఒక ఎత్తు. పుస్తక ముద్రణ ఒక ఎత్తు. ఈ విషయంలో చక్కని సలహాలనిస్తూ నాకై శ్రమపడుతూ అందంగా ముద్రించి ఇచ్చిన మాస్టర్ ప్రింటర్స్ అండ్ గ్రాఫిక్స్ అధినేత, మిత్రులు, డా. వాసిరి వసంతకుమార్ గారికి నా ప్రత్యేక అభినందనలు.

ఇంకా ఇంకా నాకు సహకరించిన మహానుభావులందరికీ కృతజ్ఞతాభివందనాలు.

**ఎన్.ఎల్.ఎన్. ఆచార్య**

# బెజ్జంకి
# దేవాలయ శిల్ప విశేషాలు

# బెజ్జంకి దేవాలయ శిల్ప విశేషాలు

డా. యస్.యల్.యస్. ఆచార్య

బెజ్జంకి గ్రామం సిద్ధిపేట కరీంనగర్ రోడ్డులో సిద్ధిపేటనుండి సుమారు 26 కి.మీ దూరంలో మెయిన్ రోడ్డు నుండి 4.కి.మీ.లో ఉంది. నేడిది మండల కేంద్రం. పూర్వం కూడ పెద్ద గ్రామమైనందువల్ల చుట్టు పక్కలుండే గ్రామాలకన్నిటికి వర్తకకేంద్రంగా ఉంది. ఇది ప్రధాన రహదారిలో లేకపోయినా మేజర్ గ్రామపంచాయతీ కావడంవల్ల, కరీంనగర్ జిల్లాలోని ప్రాచీనగ్రామాల్లో ఒకటైనందువల్ల నేటికీ ప్రసిద్ధి చెందింది.

## గ్రామ ప్రాచీనత

బెజ్జంకి, దానికి ఇంచుమించు 4, 5 కిలోమీటర్ల దూరంలో ఉన్న రేపాక, మరొకవైపు 7, 8, కిలోమీటర్ల దూరంలో ఉన్న శనిగరం మొదలైనగ్రామాలు క్రీ.శ.10వ శతాబ్దినుండే ప్రసిద్ధి గాంచినాయి. మొదట ఇవన్నీ వేములవాడ రాజధానిగా పరిపాలించిన వేములవాడ చాళుక్యుల అధీనంలో ఉండేవి. 10వ శతాబ్దికి చెందిన కన్నడ శాసనమొకటి కరీంనగర్‌కు సమీపంలో ఉన్న కురిక్యాలలో ఉంది. ఇది కన్నడ సాహిత్యంలో ఆదికవియైన పంపకవి తమ్ముడైన జినవల్లభునిది.[1]

[1] Ins. A.P. Kn Dt-3.

రేపాకలో 3వ అరికేసరి కాలానికి చెందిన శాసనం క్రీ.శ.968 ఫిబ్రవరి నెలలో వేయబడింది. ఇందు వరంగల్లు జిల్లా ఆతుకూరు ప్రధాన గ్రామంగా గల 70 ఊళ్ళకు, పమ్మి కింద ఉన్న 24 గ్రామాలకు, నంగునూరుకు అధిపతియైన విట్టికుల రేవిరెడ్డి పేర్కొనబడ్డాడు.[1] అందువల్ల రేపాకతో పాటు ఈగ్రామాలన్నీ ఇతని అధీనంలోనే ఉండినాయి. ఈ రేవిరెడ్డి మూడవ అరికేసరి సామంతుడుగా కనపడ్తాడు.

వేములవాడ చాళుక్యుల తర్వాత ఈ గ్రామాలన్నీ కల్యాణి చాళుక్యుల అధీనంలోకి వెళ్ళినాయి. హనుమకొండ విషయంలో కరీంనగర్ జిల్లా కూడా ఉండేది. క్రీ.శ.1005 నాటిదైన కల్యాణి చాళుక్య ప్రభువు ఇరివ బేడెంగ దేవుని కాద్పర్తి శాసనంలో హనుమకొండ 7009 గ్రామాలతో ఉన్నట్లు (అర్మకుండె యెఱ్ఛాసిరరొంబత్తుం) పేర్కొనబడింది[2]. కాద్పర్తి కరీంనగర్‌కు సమీపంలో ఉన్న గ్రామం. దీనిలో సబ్బిసాయిరమండలం ఒక అవాంతరభాగం. సబ్బి మండలంలో వేయి గ్రామాలుండేవి. సబ్బి మండలం లేక సబ్బినాడు కరీంనగర్ జిల్లాలోని కొంతభాగం వరంగల్లు జిల్లాలోని హనుమకొండ ప్రాంతం కలిసిన భాగంగా శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు పేర్కొన్నారు[3]. కాని శాసనాలు నేటి మెదక్ జిల్లాలోని కొంత భాగం కూడ సబ్బిమండలంలో ఉన్నట్లు తెల్పుతున్నాయి. అందువల్ల సబ్బి మండలంలో ఈ ప్రాంతం కూడా చేరి ఉంటుంది.

బెజ్జంకికి సమీపంలోని శనిగరంలో కల్యాణి చాళుక్య ప్రభువైన త్రైలోక్య మల్లదేవుని మహాసామంతుడైన మొదటి బేతరాజు, అతని

---

[1] Ins. A.P. Kn Dt-5, 2. Ibid -10.
[3] ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం పు 320.

పుత్రుడు మొదటి ప్రోలుడు, అతని మనుమడు రెండవ బేతడు, ఆతని మునిమనుమడైన రెండవప్రోలుని శాసనాలు కన్పిస్తాయి. ఈ విధంగా తొలికాకతీయుల శాసనాలు ఇచ్చట లభిస్తాయి. క్రీ.శ.1098 నాటి మిట్టపల్లి శాసనంలో ఆ గ్రామం సబ్బిసాయిరమండలంలోని పుల్గునూరుకింద ఉన్నట్లు చెప్పబడింది[1] క్రీ.శ.1107కు చెందిన రెండవ బేతరాజు శాసనంలో శని గరం పుల్గునూరు 70లో ఉన్నట్లు తెలుస్తుంది[2]. ఈ పుల్గునూరు సిద్దిపేటకు 5 కిలో మీటర్ల దూరంలో ఉన్న పుల్లూరు గ్రామం. దానికింద 70 గ్రామాలున్నట్లు వాటిలో శని గరం ఒకటైనట్లు పై శాసనం తెల్పుతున్నది.

పై శాసనాలవల్ల సబ్బి సాయిరమండలం ఇంచుమించుగా నేటి సిద్దిపేట వరకున్నట్లు తెలుస్తున్నది.

క్రీ.శ.1053 కు చెందిన శనిగరం శాసనంలో మొదటి ప్రోలరాజు, ప్రెగ్గడ మధువప్పయ్య ప్రతిష్ఠించిన మధుపేశ్వరుని అంగ రంగభోగాలకు బెజవాంకియ కాౡరెడ్డి మరికొందరు గ్రామపెద్దల అనుమతితో భూమి మొదలైనవి దానం చేసినట్లు తెలుస్తుంది[3]. ఈ శాసనంలోని కాౡరెడ్డి బెజవాంకికి చెందినవాడు. బెజవాంకి నేటి బెజ్జంకి రెండూ ఒకటే. ఇది కాకతీయ మొదటి ప్రోలరాజు కాలానికే ప్రసిద్ధి చెందింది. మధువప్పయ్య తాను చేస్తున్న దానానికి శనిగరం గ్రామపెద్దల అనుమతితోపాటు బెజ్జంకికి చెందిన కాౡరెడ్డి అనుమతి కూడ తీసుకొన్నందువల్ల శనిగరం బెజ్జంకి పరిధిలో ఉన్నగ్రామంగా ఊహించుకొనవచ్చు. అట్లే క్రీ.శ.1128 నాటి శనిగరం శాసనంలో

---

[1] భారతి-1984, నవంబర్ పు.16.

[2] Ins. A.P. Kn.Dt-19, 3. Ibid-15

బెజవాంకియ బద్దెయ శనిగరంలోని కొమ్మేశ్వరదేవుని నందాదీపానికి నైవేద్యానికి అచ్చటి మఠంలోని తపస్వుల భోజన భాజనాలకు కొంత భూమిని ఇతర వస్తువులను దానం చేసినాడు[1]. ఈ బద్దెయ కూడ బెజవాంకికి చెందిన వాడు. పై శాసనాధారాలవల్ల బెజ్జంకి క్రీ.శ. 11వ శతాబ్ది నాటికే ప్రసిద్ధి చెందిన గ్రామంగా కన్పిస్తుంది. ఈ గ్రామంలో ఇప్పటికీ కొన్ని బురుజులు కూలిపోయిన కోటగోడలు కన్పిస్తాయి. కాని వాటి నిర్మాణం అంత ప్రాచీనమైందిగా కన్పించదు.

## దేవాలయం

బెజ్జంకి గ్రామానికి దక్షిణంలో సుమారు ఒక కిలో మీటరు దూరంలో ఉన్న గుట్టపై లక్ష్మీనరసింహస్వామి ఆలయం కన్పిస్తుంది. ఈ ఆలయానికి గర్భగుడి కట్టించి విగ్రహప్రతిష్ఠ చేసి దేవాలయ నిర్మాణం గావించినట్లు కన్పించదు. ఒక పెద్దగుండుపై వెలసిన లక్ష్మీనరసింహ మూర్తికి గుడికట్టించి దానిపై విమానము, ఆ తర్వాత రంగమండపం మొదలైన కట్టడాలు చేపట్టినారు. కాల గర్భంలో శిథిల మైన కొన్ని కొన్ని భాగాలను ఈ మధ్య పునర్నిర్మించినట్లు ఈ నాటి సిమెంటు కట్టడాలవల్ల తెలుస్తున్నది. కాని ఈ గుడిని రంగమండపాన్ని ఎవరు నిర్మించారో, ఎవరికాలంలో నిర్మించారో తెల్పే శాసనాలు ఏవీ కన్పించక పోవడం మన దురదృష్టం. నిష్కామకర్మకు ప్రాధాన్యమిచ్చే మన ప్రాచీనులు తమకు కల్గే కీర్తికంటె తామునమ్మిన ధార్మికభావ ప్రచారానికే అత్యంత ప్రాధాన్యమిచ్చినట్లు తెలుస్తున్నది. లేకపోతే మన తెలుగు నాట కన్పిస్తున్న వేలాది దేవాలయాలు పుక్కిటి కథలకు

[1] Ins. A.P. Kn. Dt.-22.

గురికావల్సిన అవసరం కన్పించేది కాదు. ఇచ్చట శాసనాలవంటి చారిత్రకాధారాలు ఏవీ కన్పించకపోయినా దేవాలయశిఖరం రంగమండపం తదితర నిర్మాణాలు అందలి శిల్పాన్ని పరిశీలిస్తే అది కాకతీయ శిల్పంగా కనిపిస్తుంది. ముఖ్యంగా రంగమండపంలోని స్తంభాలు, ద్వారబంధాల సమీపంలో ఉన్న శిల్పం రామప్పదేవాలయస్తంభాలను, శిల్పాలను అనుకరించినట్లు కన్పిస్తుంది.

## కాకతీయశిల్పం

భారతీయ శిల్పం చాలా ప్రాచీనమైంది. వేదాలలో భారతీయ శిల్ప ప్రస్తావన కన్పించకపోయినా వాస్తు కళకు సంబంధించిన విషయాలు ప్రస్తావించబడ్డాయి. ఋగ్వేదంలో వేయిస్తంభాలు, వేయి ద్వారాలు గల భవనంలో నివసించు రాజు చెప్పబడ్డాడు. మిత్రావరుణుడు నూరుస్తంభాలు, నూరుద్వారాలుగల ప్రాసాదాన్ని ఆక్రమించుకొన్నగాధ కన్పిస్తుంది. తైత్తిరీయ సంహితలో వివిధాకృతులుగల దశచితులు వర్ణింపబడ్డాయి. "చితి" అనగా యజ్ఞవేదిక.

మొహంజోదారో - హరప్ప త్రవ్వకాల్లో అందమైన దేవ మూర్తులు, ఆభరణాలు, ఆయుధాలు, ప్రాచీన శిథిలాలు ఎన్నో బయల్పడినాయి. భారతీయ వాస్తు శిల్పాల గురించి ఆగమ శాస్త్రాలు వివరిస్తున్నాయి. ముఖ్యంగా కామికాగమ, అంశుమద్భేదాగమ, కారణాగమ, సుప్రభేదాగమ, వైఖానసాగమాల్లో శిల్ప లక్షణాలు, వాస్తులక్షణాలు చెప్పబడ్డాయి.

మన దేశంలో బౌద్ధులు, జైనులు కూడ తమ ప్రార్థనా మందిరాలను, ఆవాసాలను చక్కని శిల్పాలతో తీర్చిదిద్దినారు.

తెలుగు నాట క్రీ.పూ.2వ శతాబ్దినుండే దేవాలయ శిల్పం కన్పిస్తున్నది. రేణిగుంట స్టేషన్ దగ్గర ఉన్న గుడి మల్లం గ్రామంలో అత్యంత ప్రాచీన శివాలయం కన్పిస్తుంది. దీనిని పరశురామేశ్వరాలయమని పిలుస్తారు. ఇచ్చటి శివలింగము చాలా విశిష్టమైంది. నాగార్జున కొండలో ఇక్ష్వాకులనాటి దేవాలయాలు కన్పిస్తున్నాయి. గుంటూరు జిల్లా చేజెర్లలో ఒక శివాలయముంది. దీనిని కపోతేశ్వరాలయమని పిలుస్తారు. ఇది కూడ నాగార్జున కొండలోని పుష్పభద్రస్వామి ఆలయము వలె గజ పృష్ఠాకృతిలో నిర్మించ బడింది. ఈ ఆలయము పద్ధతిలోనే పల్లవుల మహాబలిపుర దేవాలయాలు ఐహోలేలోని బాదామి చాళుక్యుల దేవాలయాలు నిర్మించబడ్డాయి.

"కృష్ణానదీలోయ భూములనుండి శాతవాహన ఇక్ష్వాకురాజుల శిల్ప కళాప్రభావము గుప్తరాజులకు, వారినుండి వాకాటకులకు సంక్రమించినట్లు అజంతా శిల్ప - చిత్ర మూర్తులవలన తెలియుచున్నది. అచటినుండు బాదామి చాళుక్యులు గ్రహించిరి. వారిని పల్లవులు అనుసరించినారు. పల్లవ శిల్పముమీద విష్ణుకుండినుల ప్రభావము విశేషముగా కాన వచ్చుచున్నదని సుప్రసిద్ధ కళావేత్తలు ప్రామాణిక పరిశోధకులు ఐన శ్రీ సి. శివరామమూర్తిగారు తమ Early Eastern Chalukyan Sculpture అనే గ్రంథంలో వ్రాసినారు."[1]

5వ శతాబ్ది ఆరంభంలో బీజాపూర్ జిల్లా ఐన ఐహోలులో రాజ్య పాలన ఆరంభించిన చాళుక్యులు ఉత్తర భారతదేశంలో ఉండి వైదిక మతోద్ధరణకు అపారంగా కృషి చేసిన గుప్త సార్వభౌములను మించవలె

---

1. మన వాస్తు సంపద - పు 44

నన్న స్పర్ధతో దేవాలయ నిర్మాణము చేసినారు. వీరి నిర్మాణ పద్ధతిని చాళుక్య శైలిగా చెప్తారు. ఈ చాళుక్య శైలి వీరి తర్వాతి వారైన కల్యాణి చాళుక్య శైలికి, వీరికి సామంతులై ఆ తర్వాత స్వతంత్రించి పరిపాలించిన హొయసల శైలికి మరియు కాకతీయ శైలికి మాతృక.

చాళుక్య శైలి భిన్న లక్షణాలు గల ఉత్తర దక్షిణ రీతుల సమ్మేళనముచే ఏర్పడింది. కల్యాణి చాళుక్యులు తమ ఆలయముల నిర్మాణంలో తల విన్యాసము, నిర్మాణ రీతి, విమాన రచనలలో చాలా మార్పులు చేసినారు. వీరి నిర్మాణాలను ఏకకూట, యుగళకూట, త్రికూట, చతుష్కూటాలయాలుగా విభజించవచ్చు.

మన దేశంలో 9వ శతాబ్ది వరకు దేవాలయ నిర్మాణములకు, అర్చామూర్తులకు ఎర్ర ఇసుక రాతినే ఉపయోగించినారు. 10వ శతాబ్దినుండి నల్లరాయి దేవాలయ నిర్మాణంలో ప్రధాన స్థానాన్ని వహించింది. కల్యాణి చాళుక్యులు, వారి సామంతులు తమ నిర్మాణ శిల్పాలకు నల్లరాతినే గ్రహించి మనోహర కళాకృతులను వెలయించినారు. కాకతీయులు తమ దేవాలయ నిర్మాణంలో తలవిన్యాసము, నిర్మాణ రీతి, స్తంభ రచన, వాటి పైభాగంలోని నాసికా ప్రతిమలు ద్వార బంధాలు, మండపములు, ప్రస్తారాలు (దూలాలు), వితానములు (పైకప్పులు), విమానాలు, దేవమూర్తులు, అలంకరణ శిల్పం మొదలైన చోట చాళుక్యశైలినే అనుసరించినా కొన్ని చోట్ల తమ మాతృ శైలిని మించునట్లు శిల్ప రచన చేసినారు. అందువల్లనే కాకతీయ శైలి అని ప్రత్యేకంగా చెప్పుకొనుటకు వీలు కలిగింది.

కాకతీయ శైలిలోని కొన్ని సాధారణ లక్షణాలు ఈ విధంగా

ఉంటాయి.

తల విన్యాసాన్ని అనుసరించి అందమైన ఉపపీఠం ఆ పైన అధిష్ఠాన పీఠం దానిమీద ఆలయ నిర్మాణం జరుగుతుంది. ఉపపీఠం ఎక్కువ వెడల్పుగా నుండుటవల్ల ఇది ప్రదక్షిణాపథంగా కూడ ఉపయోగపడ్తుంది. గోడల మీద అర్ధ స్తంభాలుగాని దేవకోష్ఠాలు గాని కూర్చబడ్తాయి. పై భాగమున ప్రస్తరాలు, తల విన్యాస రేఖలలో అంతస్తులను పైవరకు తీసుకొని పోయి ముగించునట్లుండు విమానం దానిపై, శిఖరం కనిపిస్తాయి. గర్భాలయం ముందు అంతరాళం, స్తంభమండపం (రంగమండపం) దానికి మూడువైపుల అర్ధమండపాలు వాని ముందు సోపాన శ్రేణి నిర్మింపబడ్తాయి. సోపానాలకు ఇరుప్రక్కల తొండము కిందికి చుట్టుకొన్నట్లుండు ఏనుగులు కాని, యాళి/సింహ రూపములు గాని కన్పిస్తాయి. మండపానికి చుట్టు ఎత్తయిన అధిష్ఠానంగల పిట్టగోడలు కట్టి వాటి వెలుపలి భాగంలో వరుసలుగా వివిధ జంతు, పక్షి, మానవ ప్రతిమా శిల్పమాలికలు తీర్చి లోపలి వైపున ప్రేక్షకులు కూర్చుండుటకు అనువుగా కక్ష్యాసనాలు నిర్మించబడ్తాయి. మండప స్తంభాలు చక్కగా నునుపు చేయబడి వివిధ శిల్ప చిత్రాలంకారాలతో ఉంటాయి. పైభాగంలో దూలములను తాకుచుండు సుందర నర్తకీ ప్రతిమలు చెక్కిన నాసికలు అమర్చబడును. పైన వేయబడ్డ వితానాలు సంపూర్ణ శిల్పమండితములై ఉండును. కొన్నిటి పైకప్పులకు కమల గర్భాది శిల్పము లోతుగా చెక్కబడి వివిధ విన్యాసాలతో అలరారుచుండును. బహుశాఖావిలసితాలైన ద్వారబంధాలు మనోహర శిల్పాలంకృతాలై ఉండును.[1] బెజ్జంకి

---

[1] (ఆధారం) శ్రీ గడియారం రామకృష్ణశర్మగారి "మన వాస్తుసంపద"

## దేవాలయ నిర్మాణ శైలి

ఈ దేవాలయం నక్షత్రాకారంలో  నిర్మించ బడింది. మూడు వైపుల అర్థమండపాలతో మూడు ప్రవేశ ద్వారాలు ఉన్నాయి. నాల్గవ వైపు గర్భగుడి కన్పిస్తుంది. నక్షత్రాకారంలో నిర్మించిన కాకతీయుల దేవాలయాలు నల్లగొండ జిల్లాలోని పిల్లలమఱ్ఱి, నాగులపాడు, కరీంనగర్ జిల్లాలోని నగునూరు, వరంగల్లు జిల్లాలోని కటాచ్‌పూర్, జాకారం, పాలంపేట, ఘనపూర్ మెదక్ జిల్లాలోని కొండపాక, ఎల్లారెడ్డిపేట మొదలైనచోట్ల కన్పిస్తాయి.[1] ఐతే పిల్లల మఱ్ఱి నాగులపాడు, కటాచ్‌పూర్, జాకారం, ఘనపూర్, కొండపాక, ఎల్లారెడ్డిపేటలలో ఉన్న ఆలయాలు త్రికూటాలయాలు. వీటిలో మూడువైపులా దేవాలయాలుండి ఒకవైపు మాత్రమే ద్వారముం టుంది. కాని బెజ్జంకి దేవాలయం ఏకకూటాలయం. దీనికి మూడు వైపుల ప్రవేశ ద్వారాలున్నాయి. కాకతీయుల నాటి ఏకకూటాలయాలు పిల్లలమఱ్ఱి, నాగులపాడు, పాలంపేట, ఘనపూర్, కుసుమంచి మొద లగుచోట్ల కన్పిస్తాయి.[2] సాధారణంగా నాటి దేవాలయాల్లో గర్భగుడికి ముందు అంతరాళం కన్పిస్తుంది. కాని బెజ్జంకి దేవాలయంలో గర్భగుడే విశాలంగా ఉంది. అంతరాళం అంటూ ప్రత్యేకంగా కన్పించదు.

ఈ దేవాలయం దక్షిణాభిముఖంగా ఉంది. దీని మూడు వైపులా అంటే తూర్పున, పశ్చిమాన, దక్షిణంలో ప్రవేశ ద్వారాలున్నాయి. దక్షిణం వైపున్న ద్వారానికి ఎదురుగా, గర్భాలయానికి అభిముఖంగా ప్రస్తుతం ధ్వజస్తంభముంది. కాని ఇది పూర్తిగా ఆధునికమైన

---

1 కాకతీయ శిల్పం. పు -

2. మన వాస్తు సంపద - పు 61.

నిర్మాణం. ధ్వజస్తంభం శిథిలమైతే ఆగమ శాస్త్రానుగుణంగా ధ్వజ స్తంభ నిర్మాణం చేసినట్లున్నారు. ఇక్కడి నుండి గుట్ట దిగువ భాగానికి మెట్లు ఉండి ఉండాలి. అవి కూడ కాలగతిలో పూర్తిగా శిథిలమైపోయినందువల్ల కాబోలు తరువాతి కాలంలో తూర్పువైపున ఉన్న గుండుకే మెట్లు తొలగించబడ్డాయి. ఆ మెట్లు దానికింద కన్పించే కట్టడాలు అన్నీ ఇటీవలి కాలానికి చెందినవి.

ఇక దేవాలయం రంగమండపంతో సహ భూమికి సుమారు మూడ డుగుల ఎత్తులో తల విన్యాసం, ఉపపీఠం, ఆపైన అధిష్ఠాన పీఠంపై నిర్మించబడింది. తూర్పుముఖంగా ఉన్న అర్థమండపం పైనున్న వేదికలపై రెండు స్తంభాలున్నాయి.PL-1 ఈ స్తంభాలపై ఏమాత్రం శిల్పం లేకున్నా అవి చాలా అందంగా కన్పిస్తాయి. వీటిపైనున్న అడ్డదూలం కింది భాగాన మూడు పద్మాలు కన్పిస్తాయి. ఈ మూడు పద్మాలు రెండు పంచ భుజాలను కలిపినందువల్ల ఏర్పడ్డ తొమ్మిది త్రిభుజాల మధ్య కన్పిస్తాయి. ఐతే మూడు పద్మాలు మూడు రకాలుగా ఉన్నాయి. అంటే శిల్పి ఒకే విషయాన్ని అనేక స్థలాల్లో శిల్పీకరించాల్సి వస్తే శైలీ భేదాన్ని పాటించి చూపినాడు.PL-2 అట్లే దానికి రెండు వైపులా ఉండే అడ్డదూలాల కింది భాగంలో పద్మాలనే శిల్పీకరించినాడు. ఇక ఎదురుగా ఉండే అడ్డ దూలానికి ముందుభాగంలో లతలను తీర్చిదిద్దినాడు.

ఈ స్తంభాలున్న వేదిక ముందుభాగంలో ఎడమవైపు కింద నాట్య శిల్పం గోచరిస్తుంది. సున్నం వేసినందువల్ల ఆ నాట్య శిల్పం వివరించ వీలుపడదు. దానిపైభాగాన ఉన్న స్తంభాన్ని సగభాగం కప్పేస్తూ





2 పద్మసమూహం



3 ముఖద్వారం (తూర్పు)

స్తంభాన్ని ఆనుకొని ఎదురుగా శిలాఫలకం కన్పిస్తుంది. ద్వారానికి రెండు వైపులా అర్ధస్తంభాల వరకు సాగే వేదికలు దేవాలయానికి వచ్చిన భక్తగణం కూర్చోటానికి అనుకూలంగా కక్ష్యాసనంగా ఉపయోగపడ్తాయి. ఆ వేదికల వెనక భాగంలో అమర్చిన బృహచ్ఛిలా ఫలక వేదికపై కూర్చున్నవారు సుఖంగా కూర్చోటానికి అనుకూలంగా ఉంది. ఈ శిలా ఫలకం పై కప్పు వరకు లేకుండా సగం వరకే ఉన్నందువల్ల వాటిని అర్ధమండపాలంటారు. తూర్పు వైపున్న స్తంభాలకు ఆనుకొని ఉన్న ఈ బృహచ్ఛిలపై ఏనుగులు వరుసగా తీర్చిదిద్దబడినాయి. అట్లే ప్రవేశ ద్వారం ముందున్న వేదిక కింద ఇరువైపులా పద్మాలు కన్పిస్తాయి. ఈ పద్మాలు పశ్చిమచాళుక్యులు, కాకతీయులు నిర్మించిన దేవాలయాల చుట్టు ఉపపీఠం పైననో అధిష్ఠాన పీఠం పైననో కన్పిస్తాయి.[1] ఐతే ఇక్కడ ఈ ఏనుగుల పంక్తి పద్మాల పంక్తి దేవాలయం చుట్టు కన్పించదు. కొంతభాగం గజపంక్తితో మరికొంత భాగం హంసల వరుసతో ఇంకా కొంత భాగం పద్మాల వరుసతో ఇంకొక భాగం వ్యాళీమాలికతో తీర్చిదిద్దబడింది. బెజ్జంకి దేవాలయ శిల్పులు ఒక్కొక్కవైపు ఒక్కొక్క విధానాన్ని అనుసరించి శిల్ప కళాభిరుచిగల దేవాలయ సందర్శకులకు భిన్నభిన్న అనుభూతులను కల్గించుటకు ప్రయత్నించినారు. ఈ దేవాలయానికి ఉన్న మూడు ద్వారాలకు ముందు పైకప్పులో చక్కని పద్మం కనిపిస్తుంది. ఈ పద్మం త్రిభుజాకారంలో ఉన్న రాళ్ళ మధ్య కన్పిస్తుంది. ఈ శిలలపై అడ్డంగా నాల్గు దూలాలు ఉన్నాయి. ఇవన్నీ మకర తోరణ శిల్పంతో కన్పిస్తాయి. ఈ విధంగా పై కప్పులో ఉన్న పద్మం ఎనిమిది కోణాల

[1] The Ghanpur group of Temples Pl. Nos. 11 & 32.



4 హంసమాల



5. గజపంక్తి

మధ్య ఉన్నట్లు కన్పిస్తుంది.

తూర్పు ద్వారం ఉత్తరాశిపై లక్ష్మి కనిపిస్తుంది. దాని పైభాగాన చిన్న చిన్న ముకుళాలతో కొద్దిగా ముందుకు చొచ్చుకొని వచ్చిన సజ్జలాంటిది కన్పిస్తుంది.PL-3 ఇది తక్కిన ద్వారాల పైన కూడ కన్పిస్తుంది. దీనిపై వివిధ భంగిమలలో ఉన్న వ్యక్తుల మధ్య దేవాలయ శిఖరాకారంలో ఉన్న చిన్న శిఖరాలు (నాగర శైలివి) కన్పిస్తాయి. ద్వార బంధం పైనున్న ఇటువంటి సజ్జలు, ఆ సజ్జలపై ఉన్న గోడకు చిన్న చిన్న శిఖరాలలాంటి శిల్పాలు ఘనపురం[1] రామప్ప దేవాలయంలోనూ కన్పిస్తాయి. ఇక ద్వారానికి రెండువైపుల ఉండే గోడలలోనే స్తంభాలు తీర్చిదిద్దబడినాయి. కాని ఈ కుడ్య స్తంభాలపై, ద్వారబంధాలపై చెప్పుకోదగిన శిల్పం కన్పించదు. సాధారణంగా చాళుక్యశిల్పంలో కాని, కాకతీయ శిల్పంలో కాని ఈ కుడ్యస్తంభాలు, ద్వారబంధాలు చక్కని శిల్పంతో తీర్చిదిద్దబడ్డాయి. ఇక్కడి ద్వారబంధాలకు ఇరువైపులా ఉన్న గోడలలో గవాక్షాలమర్చినందువల్ల దేవాలయం లోపలికి ధారాళంగా వెలుతురు గాలి వచ్చే అవకాశముంది. ఈ గవాక్షాలన్నీ ఒకే పద్ధతిలో కాక శైలీ వైవిధ్యంతో కన్పిస్తాయి. ఇది ఆనాటి శిల్పంలోని ప్రత్యేకత.

ఇక దేవాలయం. చుట్టూ ప్రదక్షిణం చేసినట్లు వెళ్తే తూర్పు ద్వారానికి కుడిప్రక్కనున్న వేదిక వెనక భాగాన హంసల వరుస కన్పిస్తుంది.PL-4 ఆ హంసల కింద అధిష్ఠాన పీఠంపై పద్మాల వరుస కన్పిస్తుంది.PL-5 ఆ తర్వాత దక్షిణ ద్వారానికి తూర్పున

[1] The Ghanpur group of Temples Pl. Nos. 15 & 16



6 ముఖద్వారం (దక్షిణదిశ)

ఉన్న ద్వారానికి వలె ముందున్న అర్ధమండపంలో రెండు స్తంభాలు కన్పిస్తాయి. ఆ స్తంభాలపై ఉన్న అడ్డ దూలాలపై మూడు విధాలైన పద్మాలు అష్టకోణాల మధ్య కన్పిస్తాయి. ద్వారానికి రెండు వైపుల భక్తజనం కూర్చోవటానికి అనువుగా కక్ష్యాసనాలు దానిపై ఆనుకోవ టానికి వీలుగా కొద్దిగా ఎత్తైన శిలా ఫలకాలు ఉన్నాయి. అధిష్ఠాన పీఠం కింది భాగంలో పద్మపంక్తి ఆ పైన గజపంక్తి చెక్కబడింది.

దక్షిణ ద్వారం ముందున్న అర్ధ మండపంలో ఎడమ పక్కనున్న స్తంభానికి ముందున్న వేదిక (అధిష్ఠానపీఠం) పై భాగంలో ఏనుగుల వరుస కన్పిస్తుంది. దాని కింది భాగంలో ఒక స్త్రీ నాట్యం చేస్తూ ఉంటే ఇద్దరు కొమ్ము వాద్యాన్ని వాయిస్తున్నారు. ఇంకొక స్త్రీ చక్కగా తాళం వేస్తున్నది. కుడి పక్కనున్న వేదిక పైభాగంలో, దిగువభాగంలో కూడ ఏనుగులే కన్పిస్తాయి. ఇక దక్షిణ ద్వారం పై భాగంలో ఉత్తరాశిపైనున్న సజ్జ పై భాగంలో ఇరువురు భక్తులు నమస్కారముద్రతో కన్పిస్తారు. వీరి మధ్య రెండు పక్కలకు దేవాలయ శిఖర చిహ్నాలు (నాగర శైలివి) కన్పిస్తాయి.PL-6 అర్ధ మండపానికి కుడి పక్కనున్న వేదిక పైనున్న శిలాఫలకానికి వెనక పైభాగంలో ఏనుగులు, కిందిభాగంలో పద్మాలు కన్పిస్తాయి.

పశ్చిమ ద్వారం ముందున్న అర్ధ మండపానికి ఎడమ పక్కనున్న స్తంభానికి ఆనుకొని ఉన్న వేదికా ఫలకం పైభాగాన తోక పైకెత్తి భీషణంగా చూస్తున్న సింహాల పంక్తి కన్పిస్తుంది. వీటిలో కొన్ని ముందుకు చూస్తూ ఉంటే మరికొన్ని వెనుకకు తిరిగి సింహావలోకనం చేస్తున్నట్లు చెక్కబడ్డాయి. ఇవి వ్యాళీ మూర్తులు కూడ కావచ్చు.

కాకతీయ శిల్పంలో వ్యాళిమూర్తుల వరుస చాలా చోట్ల కన్పిస్తుంది. రామప్ప దేవాలయంలో వ్యాళీ మూర్తులు చక్కని అందచందాలతో కన్పిస్తాయి.[1] వీటి కింది భాగంలో పద్మాల పంక్తి కన్పిస్తున్నా ముందు భాగంలో ఒక చోట సంజీవని పర్వతాన్ని మోస్తున్న హనుమంతుడున్నాడు. కుడి పక్కనున్న స్తంభాన్ని ఆనుకొని ఉన్న శిలా ఫలకంపై హంసల పంక్తి చెక్కబడింది. కింది భాగంలో ఏనుగుల వరుస వాటి పక్క ఒక చామర గ్రాహిణి కన్పిస్తుంది. అర్ధమండపంలోని ఒక అడ్డదూలంపై రెండు పద్మాల పక్క నాట్యం చేస్తున్న పురుషుడు చెక్కబడ్డాడు.

ఈ విధంగా దేవాలయం యొక్క మూడు ద్వారాలు ఒకే పద్ధతిలో ఉన్నా అక్కడి శిలలపై భిన్న భిన్న శిల్పాలను చెక్కి నాటి శిల్పులు చక్కని శిల్ప వైవిధ్యాన్ని ప్రదర్శించినారు. అట్లే మూడు ద్వారాల ముందున్న అర్ధ మండపాలపై కప్పులో పద్మాలు, మకర తోరణాలు, లతలు, మొదలైన అలంకారాలు కన్పిస్తాయి. రంగమండపం మాత్రం గోడలతో పూర్తిగా ఆవరించబడి ఉంది. ఇది హనుమకొండ వేయి స్తంభాల దేవాలయం, రామప్ప, ఘనపుర దేవాలయాల శైలికి పూర్తిగా భిన్నమైంది. పై దేవాలయాల్లో రంగ మండపాలు సైతం అర్ధ మండపాలుగా సగంవరకు మాత్రమే ఉన్న గోడలతో ఆవరించబడి ఉన్నాయి.

ఇక గర్భగుడికి పశ్చిమంగా ఉన్న బయటి గోడపై ఆంజనేయుడు గరుత్మంతుడు కలిసి దేన్నో తెస్తున్నట్లు దానికి ఎండ తగులకుండా

---

[1] శిల్ప కళాక్షేత్రాలు II పు 96.

తమ చేతులనే అడ్డంపెట్టినట్లున్న శిల్పముంది.PL-7 వారి చేతుల్లో నున్న వస్తువు లింగాకారంలో ఉంది. ఇది ఏ ప్రాంతంలో ప్రచారంలో ఉన్న కథాశిల్పమో తెలియదు. దానికి దగ్గరలోనే రెండు భిన్న భిన్న బంధాలలో ఉన్న కామశిల్పం కనిపిస్తుంది. దాని ప్రక్కనే ఉన్న రంగమండపం వెలుపలి భిత్తికపై కూడ రెండు రతి బంధాలు చెక్క బడ్డాయి.PL-8 పురుషాయిత బంధంగా కన్పిస్తున్న శిల్పంలో పట్టెమంచం దోమతెరతో అందంగా చెక్కబడింది. ఇంకొకటి ముఖరతి శిల్పం. ఈ ముఖరతి శిల్పం రామప్ప దేవాలయంలో కూడ ఉన్నట్లు కొండూరు వీరరాఘవాచార్యులు గారు తెల్పినారు[1].

ఈ కామశిల్పం ఐదుచోట్ల ఐదువిధాలుగా చెక్కబడ్డా ఇది అంతా దేవాలయం వెలుపలి గోడలపై మాత్రమే చెక్కబడింది. దేవాలయం లోపల ఉన్న స్తంభ శిల్పంలో ఒక స్త్రీ చీరను పూర్తిగా లాగే స్తున్నట్లున్న శిల్పం కన్పించినా స్త్రీ చీర లాగేయడం, దేవాలయ అంతర్భాగంలో ఇట్టి బుద్ధి కలిగి ఉండడం వానరస్వభావంగా భావించిన శిల్పి ఈ శిల్పాన్ని చెక్కినాడు. దేవాలయానికి వచ్చే జనులు రకరకాల మనస్తత్వంతో ఉంటారు. హేయమైన ఈ దుర్బుద్ధి దేవాలయంలో తగదని సూచించుటకీ శిల్పాన్ని చెక్కినట్లు తోస్తుంది.

కామశిల్పం ఇంచుమించుగా తొమ్మిది - పదునాలుగు శతాబ్దుల మధ్య దేవాలయ శిల్పంలో కనిపిస్తున్నట్లు పట్టడకల్, ఎల్లోరా, కోణార్క్, సింహాచలం, ముఖలింగం మొదలైన దేవాలయాల్లో ఇది కన్పిస్తున్నట్లు, డా. ఘంటా జవహర్‌లాల్‌గారు తెల్పినారు. ఇటు

---

[1] శిల్ప కళాక్షేత్రాలు || పు.96.



9a రంగమండపంలోని పద్మం

వంటి శిల్పానికి రాజులు, ప్రజల ఆదరణ ఉన్నా భక్తుల దృష్టిని ఆకర్షించేటట్లుగాక, వీటిని మనరాష్ట్రంలోని దేవాలయాల్లో మరొగు ప్రదేశాల్లో చెక్కినట్లు కూడా తెల్పినారు.[1]

దేవాలయం లోపలికి ప్రవేశిస్తే గర్భాలయం ముందు నాల్గు స్తంభాలున్న రంగ మండపం కన్పిస్తుంది. ఈ స్తంభాల చుట్టూ గోడలకు ముందు కొంత సందు వదలబడింది. రంగ మండపం మధ్య భాగంలో గుండ్రని, విశాలమైన రాతి ఫలకం కన్పిస్తుంది. ఇది నునుపుగా నున్నందువల్ల నృత్యం, సంగీతం మొదలైన రంగభోగానికి విశేషపూజలవంటి అంగభోగానికి ఉపయోగపడి ఉంటుంది. సంగీతం, నృత్యం విశేష పూజలు కూర్చొని చూచుటకు అనువుగా రంగమండపంలో చుట్టు కక్ష్యాసనాలు ఏర్పాటు చేసినారు. రంగమండపం పై భాగంలో కూడ మూడు అర్ధమండపాలపై కప్పులో ఉన్నట్లు మకరతోరణ శిల్పంతో కూడిన దూలాల మధ్య అందమైన పద్మం కనిపిస్తుంది.PL-9 కాకతీయుల నాటి ఇతర దేవాలయాల్లో ఉన్నట్లు ఈ పద్మం కూడా చూపరులను అమితంగా ఆకర్షిస్తున్నది.

సాధారణంగా కాకతీయుల దేవాలయాల్లో ఉపపీఠం వెడల్పుగా ఉన్నందువల్ల అది దేవాలయానికి ప్రదక్షిణ పథంగా ఉపయోగపడుతున్నది. లేకపోతే కేవలం గర్భగుడికే ప్రదక్షిణం చేయుటానికి అనువుగా రంగమండపంలో నుండి ప్రదక్షిణ పథం కనిపిస్తుంది. కాని ఈ దేవాలయ శిల్పి ప్రత్యేకంగా ఒక ప్రదక్షిణ పథాన్ని ఏర్పాటు చేసినట్లు కన్పించదు. కాకతీయుల దేవాలయాలు సాధారణంగా

---

[1] భారతి - జనవరి 1983 - పు 30-33.

ఉపపీఠం అధిష్ఠాన పీఠాలవల్ల సుమారు పది పన్నెండడుగుల ఎత్తులో ఉంటాయి. కాని ఈ దేవాలయం ఎత్తు తక్కువగా నున్నందువల్ల ఆలయం బయటనుండే భక్తులు దేవాలయ ప్రదక్షిణం చేయవచ్చునని ప్రధాన శిల్పి భావించినట్లున్నాడు.

## స్తంభశిల్పం[PL-10]

ఈ దేవాలయ రంగస్తంభాలు నాలుగే ఐనా స్తంభం నిండా కన్పించే శిల్పాలంకారం వల్ల సర్వాంగ సుందరంగా కన్పిస్తాయి. ప్రతి స్తంభానికి నాల్గువైపుల కిందినుండి పైవరకు అనేక విధాల నృత్య భంగిమలు, పురాణ కథలు లేక ఇతర కథలు, మనకు పరిచయం ఉన్న కథలు, పరిచయం లేని కథలు, దేవతా శిల్పాలు, భక్తుల శిల్పాలు, పరిచారికల శిల్పాలు కన్పిస్తాయి. బెజ్జంకి శిల్పులు తమ నైపుణ్యాన్నంతా మేళవించి ఈ స్తంభాల్లో నింపినట్లు కన్పిస్తుంది.

సాధారణంగా ఇక్కడి ప్రతిస్తంభంలో నాల్గువైపుల పూర్తిగా కింద ఉన్న కోష్ఠ పంజరం వలె చెక్కబడ్డ భాగంలో భక్తుడు లేక పరి చారిక శిల్పం ఇంచుమించు ఆరంగుళా లుంటుంది. భక్తుని పైన నారాయణుడో లేక అతని పుత్రుడైన బ్రహ్మదేవుడో వివిధ భంగిమల్లో కనిపిస్తారు. కొన్ని స్తంభాల్లో నాట్యకత్తెలు, నాగిని లేక ఇతర స్త్రీల శిల్పం కన్పిస్తుంది. ఈ శిల్పం సుమారు రెండడుగుల చదరంలో కన్పిస్తుంది. ఈ శిల్పాల కింద భక్తులు లేక చామర గ్రాహిణుల వంటి పరిచారికలు చెక్కబడ్డారు. ఆ చదరంపైన, స్తంభం అనేక రీతుల సంగడి పట్టినట్లు నునుపుగా గుండ్రంగా కన్పిస్తుంది. అందు రెండు విడివిడిగా నున్న ఇనుపగొలుసులతో స్తంభాన్ని బిగించినట్లు

కన్పిస్తుంది. ఈ గొలుసులు అచ్చంగా ఈనాటి ఇనుప గొలుసులను పోలి ఉన్నాయి. ఈ రెండు గొలుసులకు పైనా కిందా కెంపులు మాణిక్యాలు మొదలైనవి పొదిగినట్లు మూడు వరుసలలో శిల్పం కనిపిస్తుంది.PL-11 దానిపైన స్తంభం దీర్ఘచతురస్రాకారపు పలకగా కన్పిస్తుంది. ఈ దీర్ఘచతురస్రపు పలకలో నాట్యమో, కోలాటమో లేక కథో ఒకటి కన్పిస్తుంది. దానికి కిందా, పైనా చక్కని పనితనంతో చిన్నచిన్న పలుకలుగా రాతిని సానబట్టినారు. ఈ పలకల చివరి భాగాల్లో పై భాగాన్ని కింది భాగాన్ని కలిపే బోడిపెలు కన్పిస్తాయి. ఈ బోడిపెలకు స్తంభానికి మధ్య సన్నని అంతరం కన్పిస్తుంది. ఈ ఖాళీ ప్రదేశం సుమారు అర అంగుళం నుండి ముప్పావు అంగుళం వరకు ఉంటుంది. బోడిపెల పైభాగం పగులకుండా సన్నని రంధ్రాలు చేసిన శిల్పి నైపుణ్యం చాలా గొప్పది. ఇంతకంటె సన్నని రంధ్రాలు రాతి పలకలో చేయగలమని కాకతీయులనాటి శిల్పులు హనుమకొండ వేయి స్తంభాల దేవాలయంలో నిరూపించినారు. ఆ దేవాలయంలో చీపురు పుల్ల పట్టేటంత సన్నని బెజ్జాలు రాతి పలకకు చేసినారు. ఈ పలకల మధ్య భాగంలో నిలువుగా ఉన్న త్రికోణాకారపు పలక కన్పిస్తుంది. ఈ పలకలో కిన్నెర స్త్రీయో గంధర్వ స్త్రీయో లతా సముదాయమో చెక్కబడింది. పై పలకల తర్వాత స్తంభాన్ని మళ్ళీ గుండ్రంగా తరిమెన పట్టినారు. స్తంభాగ్రంలో చిన్నచిన్న ముకుళాలతో ఉన్న గుండ్రని శిల కనిపిస్తుంది. దానిపైన నలుమూలలలో క్రింద ఉన్న ముకుళాల కన్న పెద్దనైన ముకుళాలతో ఉన్న దిమ్మె ఉంటుంది. ఈ దిమ్మెకు నాల్గువైపుల రకరకాల శిల్పం కనిపిస్తుంది. ఆ శిల్పం ఖేచరులకు, సంగీత నాట్యాలకు సంబంధించినది. వారిని



13 కోలాటం (తాళం, అంక్యమృదంగాలు వాయిస్తున్న స్త్రీలు)

మోస్తున్నట్లు దిమ్మల కింది భాగంలోనూ శిల్పం కనిపిస్తుంది. ఇవి రామప్ప దేవాలయంలోనూ కన్పిస్తాయి. వీటిని నాసికా ప్రతిమలని పేర్కొంటారు.PL-12 హొయసలుల శిల్పంలోను ఇట్టివి కన్పిస్తాయి. కాని వీటిని అచ్చట మదనికా మూర్తులుగా చెప్తారు. రామప్ప దేవాలయంలోని నాసికా ప్రతిమలు మనిషి ఎత్తులో సహజ సుందరంగా ఉంటే బేలూరులోని హొయసలుల మదనికా శిల్పాలు అందంగా ఉన్నా పరిమాణంలో చాలా చిన్నవి. అట్లే బెజ్జంకి దేవాలయంలోని నాసికా ప్రతిమలు పరిమాణంలో చాలా చిన్నవి.

నాసికా ప్రతిమలున్న దిమ్మెపైన దేవాలయం పైకప్పుకు ఆలంబనంగా ఉన్న దూలాలు కన్పిస్తాయి. ఆ దూలాల ముందు భాగాలు అందమైన శిల్పంతో నింపివేసినారు. సాధారణంగా ఈ స్తంభాల్లో కన్పిస్తున్న ఏ ఒక్క శిల్పం మరొక శిల్పంతో సంవదించదు. ఎక్కడో ఒక దగ్గర ఆ శిల్పం యొక్క ప్రత్యేకత గమనించే వారికి స్పష్టంగా తెలుస్తుంది.

## మొదటి స్తంభం

దేవాలయ ప్రవేశ ద్వారానికి (దక్షిణ ద్వారానికి) అభిముఖంగా కుడివైపు అంటే ఆగ్నేయ భాగంలో ఉన్న స్తంభానికి దిగువన కోష్ఠ పంజరం వంటి దానిలో జటామకుటధారియైన భక్తుడు కన్పిస్తాడు. దానిపైనున్న చతురస్రాకారపు ఫలకంలో విష్ణువు పద్మంలో సుఖాసీనుడై ఉన్నట్లు కన్పిస్తాడు. నారాయణునకు చతుర్భుజాలున్నా కుడివైపున ఉన్న ముందరి హస్తం మాత్రం అభయ హస్తంగా కన్పిస్తుంది. మిగిలిన హస్తాల్లోని ఆయుధాలన్నీ విరగగొట్టబడ్డాయి. కిరీట మకుటం



14 కిన్నెరస్త్రీలు

స్పష్టంగాను అందంగాను కన్పిస్తుంది. అతనికి ఇరువైపుల చామర గ్రాహిణులు కన్పిస్తారు. వీరికి పైభాగంలో ఉన్న దీర్ఘచతురస్రాకార ఫలకంపై తాళం వేస్తున్న స్త్రీ, మరియు అంక్యమృదంగాన్ని వాయిస్తున్న స్త్రీకి మధ్య ఇద్దరు స్త్రీలు కోలాటం వేస్తున్న దృశ్యం కనిపిస్తుంది.PL-13. ఒక చేత్తో మృదంగం మధ్యభాగాన్ని పొదివి పట్టుకొని మరొక చేత్తో (కుడి చేత్తో?) ఒకే వైపు మ్రోగించే వాద్యం అంక్య మృదంగం. అంకంలో పెట్టుకొనేది కాబట్టి అంక్యమృదంగమని పేరువచ్చి ఉంటుంది. ఇది ఆకారంలో ఉంటుంది. ఈ విధమైన వాద్యం నోళంబచోళుల కాలంనుండి ఉన్నట్లు వారు నిర్మించిన దేవాలయాల్లో కన్పిస్తుంది[1].

స్తంభం చివర ముందు భాగంలో ఉన్న త్రిభుజాకారపు పలకలో మృదంగం వాయిస్తున్న స్త్రీ కన్పిస్తుంది. స్తంభం పైభాగాన ఉన్న ముకుళాల మధ్య ఒక నాట్యం చేసే స్త్రీ ఆమె శిరోభాగాన మన కభిముఖంగా ఒక కిన్నెర స్త్రీ కన్పిస్తుంది.PL-14

దూలాలకు స్తంభానికి మధ్యనున్న పిల్లదూలంపై దూలాన్ని మోస్తున్న వ్యక్తి అతని కాళ్ళకింద నాట్యం చేస్తున్న స్త్రీ ఆమెపక్క మృదంగం వాయిస్తున్న ఇంకొక స్త్రీ కూడ కన్పిస్తుంది. రామప్ప దేవాలయంలోని నాట్య భంగిమలను చక్కగా పరిశీలించిన గణపతిదేవ చక్రవర్తి సామంతుడు, బావమరది, గజాధ్యక్షుడైన జాయపసేనాని నృత్తరత్నావళి వ్రాసినట్లు చెపుతారు. ఇట్లే ఇక్కడి నాట్య భంగిమలను నాట్య శాస్త్రంతో సరిపోల్చి చూస్తే ఆంధ్రనాట్యానికి సంబంధించిన

---

[1] Journal of Telugu Studies Vol. I No. 1 page 6.



**15** విష్ణువు (గరుత్మంతునిపైనున్న దేవతామూర్తి)

ఎన్నో విషయాలు మనకు అవగతమౌతాయి.

ఆ స్తంభానికి రెండవ వైపు క్రింద ఉన్న కోష్ఠ పంజరం వంటి దానిలో ఉన్న ముకుళిత హస్తుడైన భక్తుని పైన చతురస్రాకారపు పలకలో పద్మహస్తలైన ఇరువురు స్త్రీల మధ్య పద్మ పీఠంలో పద్మాసనంలో కూర్చున్న నారాయణుడు కన్పిస్తాడు. అతని నాల్గు చేతులలో ఉన్న ఆయుధాలన్నీ భిన్నమైనాయి. బెజ్జంకి శిల్పులు పరిచారకులను పరిచారికలను శిల్పించే సందర్భంలో వారిని ప్రధానమైన వ్యక్తి పక్కన ఆకారంలో చిన్నగా చూపించి వారి యోగ్యతను సూచించినారు. అట్లే భగవంతుని ప్రక్క దేవిని చూపించదలిస్తే ఆమెను అతని అంకంలోనో వాహనంపైననో చూపించినారు.

ఆ పైన ఉన్న దీర్ఘచతురస్రాకారపు పలకపై వేణువును మోగిస్తున్న స్త్రీ పక్కన నలుగురు స్త్రీలు నాట్యం చేస్తుంటే సంగీతానికి నాట్యానికి అనుగుణంగా ఇంకొక స్త్రీ తాళం వేస్తున్నది.

వీరిపైన స్తంభం చివర ముందు భాగంలో ఉన్న త్రిభుజాకారపు పలకపై అంక్య మృదంగాన్ని ఒక చేత్తో పట్టుకొని ఇంకొక చేతితో వాద్యాన్ని మోగిస్తున్న స్త్రీ కన్పిస్తుంది. ఆపైన నాట్యం చేసే స్త్రీలు, నాసికా ప్రతిమలు కన్పిస్తాయి.

ఆ స్తంభానికి మూడవ పక్క క్రిందివైపున్న కోష్ఠ పంజరం వంటిదానిలో నమస్కారముద్రలోనున్న భక్తుని పైన పద్మపీఠం మీద సుఖాసనంలో కూర్చున్న విష్ణుమూర్తి కనిపిస్తాడు. అతని నాల్గు భుజాలలో ఎటువంటి ఆయుధాలున్నాయో స్పష్టంగా తెలియదు. అవి

చాలావరకు విరిగి పోయినాయి. అతనికి ఒక పక్క నమస్కార ముద్రలో నున్న ఆంజనేయుడు రెండవ పక్క ఒక భక్తుని భుజాలపై చతుర్భుజాలతో నున్న దేవతామూర్తి కన్పిస్తుంది.PL-15 ఈమె ఎవరో ఆమెను తన భుజాలపై మోస్తున్న వ్యక్తి ఎవరో తెలియదు. ఆమె నాల్గు చేతులలో ఉన్న ఆయుధాలు కూడ స్పష్టంగా కన్పించటం లేదు.

వీరి పైన దీర్ఘచతురస్రాకారపు పలకలో ఒక వైపు మృదంగం వాయిస్తున్న స్త్రీ ఇంకొక వైపు అంక్య మృధంగాన్ని వాయిస్తున్న స్త్రీ కన్పిస్తుంది. వీరిరువురి మధ్య ఇద్దరు స్త్రీలు నాట్యం చేస్తున్నారు. వీరిపైన ఉన్న త్రిభుజాకారపు ఫలకంలో ఏకతంత్రీ వీణను మోగిస్తున్న స్త్రీ కన్పిస్తుంది. ఆమెపైన నాట్యకత్తె ఆమె శిరోభాగంలో ఒక కిన్నెర స్త్రీ ఆపైన నాసికా ప్రతిమలుగా నున్న నాట్యకత్తెలు కన్పిస్తారు.

## బ్రహ్మదేవుడుPL-16

ఆ స్తంభం యొక్క నాల్గవ వైపు కిందిభాగంలో ఉన్న కోష్ఠ పంజరం వంటిదానిలో నమస్కార ముద్రలో నున్న భక్త ఋషి పైన హంసవాహనుడైన బ్రహ్మదేవుడు కన్పిస్తాడు. పద్మంలో పద్మాసనంలో కూర్చున్న బ్రహ్మ దేవుడు పొడగైన గడ్డంతో కన్పిస్తాడు. మూడువైపులా ముఖాలు కన్పిస్తాయి. చేతులలో ఉన్న ఆయుధాలు ధ్వంసమైపోయినాయి. పొడవైన కిరీటం, ఉరోభూషణాలు, కటి భూషణాలు, యజ్ఞోపవీతం స్పష్టంగా కన్పిస్తున్నాయి. పద్మం కింద హంస కన్పిస్తుంది. అతని కుడిప్రక్కన ఒక ఋషి ఛత్రాన్ని పట్టుకొని నిలబడినాడు. రెండవవైపు చామరధారిణియైన పరిచారిక కన్పిస్తుంది.

బ్రహ్మదేవుని శిల్పమున్న చతురస్రంపైనున్న త్రిభుజఫలకంలో చతు




19 చెంచులక్ష్మి, నరసింహుల ప్రణయగాథ,



**20** చెంచులక్ష్మి, నరసింహుల ప్రణయగాథ, రామప్ప

ర్భుజుడైన వ్యక్తి స్వస్తికాసనంలో కూర్చొని ఉన్నాడు. నాల్గు చేతుల ముందు భాగాలు విరిగిపోయినాయి. కాని ముందుభాగంలో ఉన్న కుడిచేతి దగ్గర కలశముంది. గడ్డం కూడ కనిపించదు. శిరస్సు ఒకటే ఉంది. అందువల్ల ఇది బ్రహ్మ శిల్పం కానేరదు.

దీని పై భాగంలో ఉన్న దీర్ఘచతురస్రాకారపు ఫలకంలో ఒక స్త్రీ నిలబడి పాడుతూ ఉంటే ఇద్దరు స్త్రీలు నాట్యం చేస్తున్నారు. వీరి ప్రక్కన ఒకరు మృదంగాన్ని ఇంకొకరు అంక్యమృదంగాన్ని వాయిస్తున్నారు. ఆ పైన ఉన్న త్రిభుజాకారపు ఫలకంలో కూడా ఇంచుమించుగా కింద ఉన్న త్రిభుజాకారపు ఫలకంలో ఉన్నట్లు ఒక శిరస్సు, రెండు భుజాలు ఉన్న వ్యక్తి ముందున్న కుడిచేతి దగ్గర కలశముంది. పొడవైన గడ్డం జటాజూటం లేనందువల్ల ఇతడొక ఋషి అని చెప్పుటకు వీలుపడదు.

ఈ స్తంభానికి చివర ఒక నాట్యకత్తె కన్పిస్తుంది. ఆమె తలపైన దుర్గ కాబోలు కన్పిస్తుంది. ఆదేవి చతుర్భుజ. వెనకనున్న రెండు చేతుల్లో డమరుకము త్రిశూలం కన్పిస్తాయి. కుడివైపున్న ముందరి చేతిలో పద్మం కాబోలు కన్పిస్తుంది. ఎడమ వైపున్న ముంజేతిలో ఏముందో స్పష్టంగా తెలియదు.PL-17 దానిపైనున్న దూలాల చివర రెండు వైపుల గంధర్వ స్త్రీలు(?) (మృగ రూపానికి స్త్రీ తలకల వ్యక్తులు) కన్పిస్తారు.PL-18 ఈ స్త్రీలు స్తంభానికి నాల్గువైపుల నున్న పిల్ల దూలాలకు రెండు వైపులా మొత్తం ఎనమండుగురు చెక్కబడ్డారు.

### చెంచులక్ష్మిPL-19

రెండవ స్తంభం యొక్క ముందు భాగం క్రిందనున్న కోష్ఠ



21 చెంచులక్ష్మి, నరసింహుల ప్రణయగాథ, అహోబిలం



22 కోలాటం

పంజరాకార భాగంలో చామర ధారిణియై నిలుచున్న స్త్రీ కన్పిస్తుంది. ఆపైనున్న చతురస్రాకారపు ఫలకంలో ఇద్దరు భిల్ల స్త్రీలు కన్పిస్తారు. వారిద్దరి చేతులలో ధనుస్సులున్నాయి. వస్త్రాలు ధరించినట్లుగా కాక తోలు వస్త్రాలు(?) మోకాళ్ళ వరకు ధరించినారు. నడుముకు చిన్నబాకు కూడ కన్పిస్తుంది. కంఠాభరణాలు, లావైన పెద్దరింగులు చెవులకు కన్పిస్తాయి. పక్క కొప్పు పెట్టుకొన్నారు. ఆటవిక లక్షణాలు వారిద్దరి లోను కన్పిస్తున్నాయి. ఒక స్త్రీ రెండవ స్త్రీ సఖి కాబోలు చిలుకను చేతిలో పట్టుకొన్నది. రెండవ చెంచు స్త్రీకి ముల్లు గుచ్చుకొన్నట్లున్నది ఆమె ప్రియుడు ముల్లు తీయడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆమె ఠీవిగా నిలబడడం వల్ల నాయికగా కన్పిస్తున్నది.

ఇటువంటి శిల్పం రామప్ప దేవాలయంలోనుPL-20 [1] అహోబిల క్షేత్రంలోని మహామండపంలో మరియు కల్యాణ మండపంలోను[2] కన్పిస్తుంది.PL-21 ఈమెను చెంచులక్ష్మిగా ఆమె ప్రియుడైన నరసింహుడు మానవమూర్తియై ఆమె పాదానికి గుచ్చుకొన్న ముల్లును తీస్తున్న శృంగార గాథా శిల్పంగా పేర్కొంటారు.[3] బెజ్జంకి కూడ లక్ష్మీ నరసింహస్వామి ఆలయం. కావున నాటి శిల్పి చెంచులక్ష్మీ నరసింహుల ప్రణయగాథను అక్కడి శిల్పంలో చూపినాడు. ఐతే ఈ శిల్పం, రామాయణ భాగవతాలలోని వైష్ణవగాథా శిల్పాలు రామప్పలోని శివాలయంలో కన్పించుటకు ఆనాటి పాలకుల, దేవాలయ నిర్మాతల మత సామరస్యతత్వం ప్రధాన కారణమనిపిస్తుంది. శివాలయాలలో విష్ణుగాథలు,

---

1. Kakatiya Sculpture front page.
2. Sri Ahobila Narasimha Swamy Temple Pl Nos 44 & 52A
3. History of the Cult of Narasimha in A.P. - P. No. 151



23 చీరలాగుతున్న కోతి

వైష్ణవాలయాలలో శైవగాథలు నాటి అన్ని దేవాలయాల్లో కన్పిస్తాయి. చివరకు పరమ వైష్ణవుడుగా రామానుజ మత ప్రచారకుడుగా చెప్ప బడుతున్న పల్నాటి బ్రహ్మన్న యొక్క మాచెర్ల చెన్నకేశవాలయంలోని స్తంభంలో శివకృత రావణగర్వభంగ శిల్పం, ఆ దేవాలయం పక్కనే ఇంచుమించుగా ఒకే ఆవరణలో శివాలయమూ కన్పిస్తాయి. ఇవి మన ప్రాచీనుల మత సామరస్యానికి కొన్ని ఉదాహరణలు మాత్రమే. వేములవాడలోని భీమేశ్వరస్వామి దేవాలయం పీఠంపై దశావతారాలు చెక్కబడ్డాయి.

చెంచులక్ష్మి పైభాగంలో ఉన్న దీర్ఘ చతురస్రాకారపు పలకలో కోలాటం ఆడుతున్న నల్గురు స్త్రీలు, వారి ఆటకు అనుగుణంగా మృదంగాన్ని వాయిస్తున్న వ్యక్తి కనిపిస్తాడు PL-22 . స్తంభం చివర నున్న నాసికా ప్రతిమపై ఒక వ్యక్తి వేణువు ఊదుతున్నాడు. రెండో పక్కనున్న వ్యక్తి మృదంగం వాయిస్తున్నాడు. వీరిద్దరి మధ్య వేణు, మృదంగ వాద్యాల కనువుగా నాట్యం చేస్తున్న స్త్రీ కన్పిస్తుంది.

## చీర లాగుతున్న కోతి PL-23

ఆ స్తంభానికి రెండవ వైపు కిందిభాగంలో నున్న చామర ధారిణికి పైన ఒకస్త్రీ నాట్య భంగిమలో నిలబడింది. ఆమె ఆభరణాలు, చక్కని వస్త్రాలు, మెడలో పొడవైన పుష్పమాల ధరించి చాలా చక్కగా కన్పిస్తున్నది. రెండో స్త్రీ కూడ ఇంచుమించుగా మొదటి స్త్రీవలె చక్కగా అలంకరించుకొంది. కాని రెండో స్త్రీ ధరించిన చీరను కింద ఉన్న ఒక వానరుడు లాగుతున్నాడు. జారిపో తున్న చీరను ఒకచేత్తో పట్టుకొంటూ చీరను లాగుతున్న కోతివైపు



**24** చీరలాగుతున్న కోతి రామప్ప

ఆశ్చర్యంగా జూస్తున్నదా స్త్రీ. ఈ శిల్పం ఈ దేవాలయంలోని మరొక స్తంభంపై కూడ కన్పిస్తుంది. రామప్ప దేవాలయంలో కూడ ఈ శిల్పముంది.PL-24 రామప్ప శిల్పం కన్న ఈ శిల్పం గొప్పగా కన్పిస్తుంది. ఇక్కడి శిల్పం సహజంగా కూడ కన్పిస్తుంది. రామప్ప దేవాలయ శిల్పంలో చీర తనంత తానే నడుమునుండి కాళ్ళపైనుండి జారుతున్నట్లు కన్పిస్తుంది. కింద ఒక వానరమున్నా ఎవరో చీరను పట్టుకొని లాగితే కిందికి జారిపోతున్నట్లు కన్పించదు. ఇక్కడి శిల్పి, ఒక వానరం కిందనుండి చీరను పట్టుకొని లాగుతున్నందువల్ల అది జారిపోతున్నట్లు సహజంగా చెక్కినాడు.

దేవాలయానికి అనేకులు అనేక భావనలతో వస్తూ ఉంటారు. కొందరు భక్తి భావంతో వస్తే మరి కొందరు కామభావంతో వస్తారు. నిర్మలమైన భావనకు హేతువు కావలిసిన దేవాలయంలో స్త్రీని మోహ భావంతో చూచే మనస్తత్వాన్ని శిల్పి వానర మనస్తత్వంగా చూపి ఉంటాడు. ఈ భావాన్ని మరింత స్పష్టంగా హనుమకొండలోని వేయి స్తంభాల దేవాలయ శిల్పి చూపించినాడు.

సహస్ర స్తంభ దేవాలయ మండపానికి ఎదురుగా నున్న శిథిల మౌతున్న మండపం దక్షిణ భాగంలో ఇద్దరు స్త్రీలు పూలు పండ్లు దేవాలయానికి కాబోలు తీసికొని పోతున్న శిల్పం కనిపిస్తుంది. ఆ పండ్లబుట్టపై ఒక చిలుక ఉంది. పూలు పండ్లు తీసుకొని వస్తున్న ఆ స్త్రీ కీరవాణి అందమైంది అని శిల్పి అభిప్రాయం. ఆమెకు ఎదురుగా ఒక మునీశ్వరుడు నిలబడి ఆమెను మోహ దృష్టితో చూస్తున్నాడు. ఆ మునీశ్వరుని బుద్ధిని కోతిబుద్ధిగా వర్ణిస్తూ శిల్పి ఆ మునీశ్వరుని

కాళ్ళ దగ్గర వానరాన్ని చెక్కినాడు.

ధార్మిక భావనను ప్రోత్సహిస్తూనే మానవ సాధారణంగా కలిగే దుష్టమైన భావనను నిరసిస్తూ దాన్ని వెక్కిరిస్తున్న శిల్పాలు మన ప్రాచీన దేవాలయాల్లో చాలా కన్పిస్తాయి.

ఆపైన ఇద్దరు స్త్రీలు నాట్యం చేస్తుంటే పక్కన నిలబడ్డ ఒక స్త్రీ ఏక తంత్రీ వీణను వాయిస్తున్నది. ఇంకొక పక్క ఇద్దరు పురుషులు మృదంగాన్ని అంక్య మృదంగాన్ని వాయిస్తున్నారు. ఆ పైన ఉన్న నాసికా ప్రతిమపై ఇద్దరు స్త్రీలు నాట్యం చేస్తుంటే మూడవ వ్యక్తి వేణువును ఊదుతున్నాడు.

ఆ స్తంభానికి వెనక భాగాన క్రిందివైపు కోష్టపంజరం లాంటి దానిలో చామర ధారిణి ఉండగా దానిపై నున్న చతురస్రంలో సైతం ఇద్దరు చామర ధారిణులున్నారు.

## విద్యాలయ శిల్పం PL-25

చతురస్రంపైన ఇద్దరు మునులు కాబోలు చర్చించుకుంటున్నారు. వారి సిగ ముడి చాలా వింతగా కన్పిస్తుంది. జడలను చక్కగా తీర్చిదిద్ది మధ్యకు ముడి వేసినట్లు కన్పిస్తుంది. జటాజూటంతో పాటు పొడవైన గడ్డమున్నందువల్ల వారిని మునులని ఊహించుట కాస్కార ముంది. శ్రీశైలంలోని దేవాలయ శిల్పంలో ఇటువంటి జటాజూటం, గడ్డం ఉన్న మునులు కన్పిస్తారు. PL-26 [1] ఒక ముని వెనక భృత్యుడు కాబోలు ఛత్రాన్ని పట్టుకొని నిలబడినాడు. అతని వెనక ఒక పురు

[1] విజ్ఞాన సర్వస్వం - తెలుగు సంస్కృతి । పు 817



27 రామాయణ శిల్పం (భరత సమాగమం)

షుడు చంకలో పుస్తకం చేతిలో గంట పట్టుకొని నిలబడ్డాడు. ఇది ఆనాటి విద్యాలయానికి సంబంధించిన శిల్పం. నాటి ఉపాధ్యాయులు ఋషితుల్యులు. ఘటశాసులు శైవసన్యాసులు, శైవాచార్యులు నాడు విద్యాలయాలను ఘటస్థానాలలో మఠాలలో స్థాపించి విద్యా ప్రచారం చేయడం నాటి శాసనాల్లో కనిపిస్తుంది.

ఆ పైనున్న నాసికా ప్రతిమపైన ఒక స్త్రీ నాట్యం చేస్తుంటే ఇంకొక స్త్రీ తాళం వేస్తున్నది. మరియొక స్త్రీ అంక్య వాద్యాన్ని వాయిస్తున్నది.

ఆ స్తంభం యొక్క వెనక పక్క ఉన్న చతురస్రాకారపు పలకలో నాట్య శిల్పమే కనిపిస్తుంది. ఒక స్త్రీ నాట్యం చేస్తుంటే రెండవ స్త్రీ తాళం వేస్తున్నది.

## రామాయణ శిల్పం[PL-27]

ఆ పైన ఉన్న దీర్ఘ చతురస్రాకారపు పలకలో రామాయణ గాథ చెక్కబడింది. ఒక ముని వంటి వ్యక్తి (జటాజూటం చక్కగా ఉంది) మోకాళ్ళకు అంగవస్త్రం వంటి దానిని కట్టుకొని కూర్చున్నాడు. అతనికి ఎదురుగా ఇద్దరు పురుషులు నిలుచుని మాట్లాడుతున్నారు. అతని వెనక నిలుచున్న వ్యక్తి చేతిలో ధనుస్సు ఉంది. వీరిద్దరి మధ్య ఒక స్త్రీ కన్పిస్తుంది. ఇది రామాయణంలో చిత్రకూట పర్వతంపై సీతాలక్ష్మణ సమేతుడైన రామచంద్రునితో భరత శత్రుఘ్నులు సమా వేశమైన దృశ్యం. పీటముడి వేసుకొని కూర్చున్న వ్యక్తికి ముందు నిలుచున్న వారి మెడలలో హారాలు స్పష్టంగా కన్పిస్తున్నందువల్ల వారిని



28 రామాయణశిల్పం (హనుమత్సందేశం)



29 నాగిని శిల్పం

రాకుమారులుగా గుర్తించవచ్చును.

ఆ శిల్పం పైనున్న త్రికోణాకారపు పలకలో ఒక కిన్నెర స్త్రీ కనిపిస్తుంది. ఆమె పైన నాసికా ప్రతిమగా నాట్య శిల్పం ఆపైన రెండు రాజహంసలు చక్కగా కన్పిస్తాయి. ఆ పైన ఒక స్త్రీ నాట్యం చేస్తుంటే ఒక పక్క ఏక తంత్రీ వాద్యాన్ని, రెండో పక్క అంక్య వాద్యాన్ని ఇద్దరు పురుషులు వాయిస్తున్నారు.

## మూడవ స్తంభం

గర్భగుడి కెదురుగా కుడి ప్రక్కనున్న మూడవ స్తంభానికి ముందు భాగంలో కింది వైపు ఇద్దరు నాట్యకత్తెలు కన్పిస్తారు.

## రామాయణ శిల్పం[PL-28]

ఆ పైన ఉన్న దీర్ఘ చతురస్రాకారపు పలకలో జటాజూటంతో నున్న ముని వేషధారి పీటముడి వేసుకొని కూర్చున్నాడు. అతనికి ఎదురుగా ఒక వానరుడు నిలబడి నమస్కరిస్తున్నాడు. ఆ వానరుని వెనక ఇంకొక వానరుడు పీటముడి వేసుకొని కూర్చున్నాడు. మునివే షధారి వెనక ఒక స్త్రీ కూర్చొని ఏమో చెప్తూతున్నది. ఆమె వెనక ఋషి వలె జటాజూటం గలిగి నిలుచున్న వ్యక్తి చేతిలో ధనుస్సు ఉంది. జటాజూటంతో పాటు ధనుస్సు చేతబట్టి నిలుచున్న వ్యక్తిని లక్ష్మణుడని ఇంకొక స్తంభంలో ఉన్న రామాయణ గాథా శిల్పంలో వలె నిశ్చయిస్తే అతనికి ముందు జటాజూటంతో కూర్చున్న వ్యక్తి రామచంద్రుడుగా అతనికి నమస్కరిస్తున్న వ్యక్తి ఆంజనేయుడుగా అతని వెనక కూర్చొని ఉన్న వ్యక్తిని సుగ్రీవుడుగా భావించుకొంటే

సీతయొక్క యోగక్షేమాలను రామునికి విశదపరుస్తున్న ఆంజనేయుని గాథగా దీన్ని ఊహించుకొనవచ్చు. కాని ఇక్కడ శ్రీరాముని వెనక కూర్చున్న స్త్రీ ఎవ్వరో అర్థం కాని విషయం. సుగ్రీవుని వెంట వచ్చిన తార కాబోలు అని అనుకుంటే తార రామచంద్రుని వెనక కూర్చోదు కదా. ఇది విచారించవలసిన అంశం.

ఆపైన ఉన్న నాసికా ప్రతిమపై ఒక స్త్రీ నాట్యం చేస్తుంటే ఇద్దరు పురుషులు వాద్యాలు ప్రయోగిస్తున్నారు.

ఆ స్తంభానికి కుడి పక్క వానరుడు ఒక స్త్రీ చీరలాగుతున్న దృశ్యమే కన్పిస్తుంది. పక్కన వేణువునూదుతున్న మరొక స్త్రీ కనిపిస్తుంది. ఆపైన ఉన్న దీర్ఘచతురస్రంలో ఒక స్త్రీ నాట్యం చేస్తుంటే ఇంకొక స్త్రీ తాళం వేస్తున్నది. రెండవ పక్క ఒకడు మురళిని రెండవవాడు అంక్య వాద్యాన్ని మూడవవాడు మృదంగాన్ని వాయిస్తున్నాడు. ఆ పైన నాసికా ప్రతిమ ఆమెపైన నాట్యసుందరులు కన్పిస్తారు.

## నాగిని శిల్పం PL-29

ఆ స్తంభానికి వెనక భాగంలో కింది వైపున్న చతురస్రంలో నాగిని శిల్పం కనిపిస్తుంది. రామప్ప దేవాలయంలో ఉన్నట్లే PL-30 ఈ నాగిని కూడ వస్త్రాలేమీ లేకుండా కన్పిస్తుంది. కాని బెజ్జంకి నాగిని రామప్ప నాగిని కంటె చూడ చక్కగా ఉంటుంది. ఈమె రెండు చేతులతో ఒక సర్పాన్ని ఎత్తి పట్టుకొన్నది. రామప్ప నాగిని భుజాలపై నుండి కిందికి వేలాడుతున్న రెండు సర్పాలుంటే బెజ్జంకి



**32** యోగానంద నృసింహస్వామి



**33** యోగానందనృసింహస్వామి, విజయనగరశిల్పం

నాగిని భుజాలపై చాలా పొడవైన సర్పమొక్కటే రెండు భుజాలను కలుపుతూ పొడవైన పుష్పహారం వలె కన్పిస్తుంది. కాళ్ళకు కూడ సర్పబంధం ఉంది. ఇద్దరు త్రిభంగిమ స్థితిలోనే ఉన్నారు. కాని రామప్ప నాగిని సమపాద. బెజ్జంకి నాగిని వ్యత్యస్త పాద. అంటే నాట్య భంగిమలోనే ఉంది. అట్లే పక్కన ఏక తంత్రీ వాద్యాన్ని మోగిస్తూ వ్యత్యస్త పాదగా నున్న ఆమె సఖికూడ మోకాళ్ళపై నాగబంధం కలిగి ఉంది. రామప్ప శిల్పంలో నాసికా ప్రతిమల పక్కన ఉన్న శిల్పాలు పరిమాణంలో చాలా చిన్నవి. కాని బెజ్జంకి స్తంభంలో నాగిని, పక్కనున్న సఖి ఇద్దరు ఒకే ఎత్తులో కన్పిస్తారు. ఇద్దరి మెడలకు, కాళ్ళకు, చేతులకు చాలా పరిమితమైన ఆభరణాలు కన్పిస్తాయి.

## క్షీరసాగర మథనం PL-31

నాగిని శిల్పానికి పైన ఉన్న దీర్ఘచతురస్రంలో క్షీరసాగర మథన దృశ్యం కన్పిస్తుంది. మందర పర్వతానికి కవ్వం తాడువలె కట్టబడ్డ వాసుకి యొక్క తల, తోక స్పష్టంగా కన్పిస్తున్నాయి. తలవైపున నున్న రాక్షసులు ఊర్ధ్వ కేశులు. ఇక తోకవైపు ఉండవలసిన దేవతలకు బదులు అందరు వానరులే కన్పిస్తున్నారు. కారణం ఊహించరానిది. ఆ పైన నాసికా మూర్తులు తరువాత నాట్యశిల్పం కన్పిస్తుంది.

## నాల్గవ స్తంభం
## యోగానంద నృసింహుడు PL-32

నాల్గవ స్తంభం ముందుభాగంలో క్రింద చిన్న పీఠంపై యోగానంద



34 లక్ష్మీనరసింహస్వామి

నృసింహస్వామి కన్పిస్తాడు. యోగాసనంలో ముందరి రెండు చేతులతో కాళ్ళను స్పృశిస్తున్నట్లు కన్పిస్తాడు. కాని విజయనగర శిల్పంలో అంతటా యోగానంద నృసింహస్వామికి మోకాళ్ళ దగ్గర పట్ట బంధం కన్పిస్తుంది.PL-33 [1] ఇచ్చటి యోగానంద నృసింహస్వామికి ఇరువైపుల ఆంజనేయుడు గరుత్మంతుడు నమస్కారముద్రలో కనిపిస్తారు.

ఆ పైన ఉన్న పట్టికలో ఇరువురు స్త్రీలు నాట్యం చేస్తుంటే పక్కన ఇద్దరు వాద్యాలు మోగిస్తున్నారు. ఇంకొక స్త్రీ నాట్యానికి అనుగుణంగా తాళం వేస్తున్నది. ఆపైన నాసికా ప్రతిమ, దానిపైన ఒక స్త్రీ మృదంగం వాయిస్తుంటే మరొక స్త్రీ నాట్యం చేస్తున్నది.

## లక్ష్మీ నరసింహుడుPL-34

ఆ స్తంభానికి రెండవ ప్రక్క నృసింహస్వామి కమలాసనంపై కూర్చున్నాడు. కుడికాలు కిందికి వేసుకొన్నాడు. ఎడమకాలు ముడుచుకొని కూర్చున్నాడు. దానిపై లక్ష్మీదేవి ఆసీనయై ఉంది. కంఠ భూషలు, ఉరోభూషలు, కటిభూషలు కూడ స్పష్టంగా కనిపిస్తు న్నాయి. కాని స్వామి చతుర్భుజాల్లో ఉన్న ఆయుధాలు విరిగి పోయినాయి. స్వామికి కింది భాగంలో ఇరువైపుల ఆంజనేయుడు గరుత్మంతుడు నమస్కారముద్రలో నిలుచున్నారు.

## కోలాటం

ఆపైన ఆరుగురు స్త్రీలు కోలాటమాడుతున్నారు. ఇద్దరిద్దరు ఒకరికొకరు అభిముఖంగా నిలబడి కోలలతో ఆడడమే కాక తనకు

---

[1] Sri Ahobila Narasimha Swamy Temple Pl No. 2D.



**35** నరసింహామూర్తి

వెనకనున్న స్త్రీకి కూడ ఒక చేతితో తన కోలను అందిస్తున్నది. ఆపైన మృదంగం వాయిస్తున్న స్త్రీ, ఆమె పైన నాసికా ప్రతిమ, ఆపైన నాట్య శిల్పముంది.

## నరసింహుడు[PL-35]

ఆ స్తంభానికి మూడవ పక్క నరసింహుడు ఆదిశేషునిపై సుఖాసన మూర్తియై కనిపిస్తాడు. సాధారణ దృష్టితో చూచేవారికి నరసింహుడు కమలం పైన కూర్చున్నట్లు అగుపిస్తుంది. కాని పరిశీలనగా చూస్తే శేషుని ఫణాలు స్పష్టంగా కన్పిస్తాయి. నరసింహుడు శేషసింహాసనస్థుడుగా ప్రసిద్ధుడే కాని శేష ఫణాలపై కూర్చున్నట్లు ప్రసిద్ధుడుకాదు. శిల్పి ఈ కధను ఎక్కడ చూచాడో లేక ఎక్కడ విన్నాడో తెలియదు. నారసింహుని చతుర్భుజాలలో నున్న ఆయుధాలు చాలా స్పష్టంగా ఉన్నాయి. వెనకనున్న కుడి చేతిలో పద్మం ఎడమ చేతిలో గద (పైభాగం విరిగిపోయింది) ముందున్న కుడిచేతిలో చక్రం ఎడమచేతిలో శంఖం కన్పిస్తున్నాయి. రూపమండనమనే శిల్ప శాస్త్రాధారంగా పై పద్ధతిలో ఉండే విష్ణువు యొక్క మూర్తి నరసింహునిదని A hand book of South Indian Images (పు 58) తెల్పుతున్నది. పాంచరాత్ర క్రియా పాదం కూడ నరసింహుని స్వరూపాన్ని ఈ విధంగా తెల్పుతున్నది.

"నారసింహః శ్వేతవర్ణః గదాశంఖారి పద్మభృత్"

"శ్రీనారసింహమూర్తి తెల్లని శరీరచ్ఛాయలతో, నాల్గు చేతులతో నుండును. కుడివైపున క్రింది నుండి పైకి చక్రమును, పద్మమును,

ఎడమ వైపున శంఖమును, గదను నాలుగు చేతులతో ధరించును.

-- రూపధ్యాన రత్నావళి-పు *218*

ఐతే ఈ నారసింహమూర్తి ఈనాడు మనకు సుపరిచితమైన సింహ వక్త్రంతో ఉన్నది కాదు. ఆగమ ప్రసిద్ధమైన మూర్తిని శిల్పి యథాతథంగా ఇచ్చట చెక్కినాడు. ఈ నారసింహుని పక్క శ్రీదేవి భూదేవి కాబోలు పద్మహస్తలై నిలబడి యున్నారు.

ఆపైన కోలాట దృశ్యం, స్తంభం చివర నాసికా ప్రతిమలు, నాట్య శిల్పం కన్పిస్తాయి.

ఇక ఆ స్తంభానికి నాల్గవ పక్క హంస వాహనుడైన బ్రహ్మదేవుడు పద్మంలో స్వస్తికాసనంలో కాబోలు కూర్చున్నాడు. చతుర్భుజాలు స్పష్టంగా కనిపిస్తున్నా వెనక చేతులలోని ఆయుధాలు ముందున్న చేతులు పూర్తిగా విరిగి పోయినందువల్ల గుర్తు పట్టడం కొంత కష్ట మనిపించవచ్చు. కాని చతుర్ముఖాలు (మనకు కన్పించేవి మూడు ముఖాలే) దీర్ఘంగా కనిపిస్తున్న గడ్డము, హంస, పద్మం అతనిని స్పష్టంగా గుర్తించేటట్లు చేస్తున్నాయి. బ్రహ్మదేవునికి ఇరుప్రక్కల ఇద్దరు భృత్యులు ఛత్రాలను ధరించి నిలబడి ఉన్నారు.

విష్ణువు PL-36

బ్రహ్మదేవునికి పైనున్న త్రిభుజాకారపు పట్టికలో విష్ణుమూర్తి శిల్పం కన్పిస్తుంది. ఈ శిల్పం చాలా చిన్నగా ఉన్నప్పటికీ చతుర్భుజాల్లోని ఆయుధాలు చాలా స్పష్టంగా కన్పిస్తున్నాయి. వెనకనున్న కుడిచేతిలో పద్మం ఎడమచేతిలో శంఖం ముందుండే కుడి చేతిలో గద



**37** లక్ష్మీనరసింహస్వామి (మూలవిరాట్)

ఎడమ చేతిలో చక్రమున్నాయి. ఇటువంటి స్వరూపం విష్ణుమూర్తిదని రూపమండనం, రూపధ్యాన రత్నావళి తెల్పుతున్నాయి.

"ధౌతవర్ణో భవేద్విష్ణుశ్చక్ర శంఖ గదాబ్జభృత్
హేమాంబరధరః స్రగ్వీ కేయూరాంగద భూషితః

శ్రీ విష్ణుమూర్తి కుడివైపున క్రిందినుండి పైకి గదను, పద్మమును అట్లే ఎడమ భాగమున చక్రమును, శంఖమును కుడి ఎడమల నాల్గు చేతులతో ధరించును."

-- రూప ధ్యాన రత్నావళి - పు *213.*

ఆపైన ఉన్న దీర్ఘచతురస్రాకారపు ఫలకంలో ఒక స్త్రీ ఏకతంత్రి వీణను పట్టుకొని పాడుతుంటే పక్కన ఇద్దరు కిన్నెర స్త్రీలు కిన్నెరలు పట్టుకొని తదనుగుణంగా వాయిస్తున్న దృశ్యం కన్పిస్తుంది.

ఆపైన దుర్గ కాబోలు చతుర్భుజాలతో కనిపిస్తుంది. వెనకనున్న కుడిచేతిలో డమరు, ఎడమ చేతిలో త్రిశూలం కన్పిస్తాయి. ముందున్న చేతులలో ఏయే ఆయుధాలున్నాయో స్పష్టంగా కనిపించదు. ఇటువంటి విగ్రహమే నాసికా ప్రతిమలపైన కన్పిస్తున్నది.

దేవాలయం రంగమండపంలోని కక్ష్యాసనంలో భిన్నమైన లక్ష్మీ నరసింహస్వామి పూర్ణ శిల్పం కనిపిస్తుంది.PL-37 ఇది మూల మూర్తియని, భిన్నమైనందువల్ల అర్చనా యోగ్యత లేక గర్భగృహానికి బయట పెట్టినట్లు స్వామివారి అర్చకులు శ్రీమాన్ వరదాచార్యుల వారు తెల్పినారు.



38 దీపస్తంభం

అట్లే ఈ విగ్రహానికి శంఖు చక్రాలు తారుమా రయినట్లు కుడిచేతిలో శంఖువు, ఎడమచేతిలో చక్రం కన్పిస్తాయి. ముందున్న దక్షిణ హస్తం అభయ హస్తం వరదహస్తమైన ఎడమచేయి ముందుభాగం కొంత భిన్నమైంది. కాని అభయ హస్తం పక్కన గద కూడ ఉంది. ఈ లక్షణం వాసుదేవమూర్తిదని రూపమండనం పేర్కొంటున్నది.

అట్లే పాంచ రాత్ర క్రియాపాదం కూడా వాసుదేవమూర్తిని "వాసుదేవః శంఖచక్రగదా పద్మ ధరః సితః" అని తెలిపింది.

"శ్రీ వాసుదేవమూర్తి తెల్లని శరీర ఛాయతో నాల్గుచేతులతో నుండును. కుడి భాగమున క్రిందినుండి పైకి గద, శంఖము అట్లే ఎడమవైపున పద్మము, చక్రము నాల్గు చేతులతో ధరించును".

-- *రూప ధ్యాన రత్నావళి - పు 216*

అయితే ఇది లక్ష్మీ నరసింహమూర్తి. లక్ష్మీ నృహింహమూర్తిని పాంచరాత్ర క్రియా పాదం ఈ విధంగా వివరిస్తుంది.

"శరచ్చంద్రనిభం దేవం శంఖచక్రవరాభయాన్
బిభ్రాణం పుండరీకాక్షం లక్ష్మ్యాలింగిత విగ్రహం
సింహవక్త్రం మహాకాయం నృసింహం హృది భావయేత్"

శ్రీ లక్ష్మీ నరసింహమూర్తి శరత్కాల చంద్రునివలె మిక్కిలి తెల్లని శరీరచ్ఛాయలతో, సింహము యొక్క మొగముతో పెద్ద శరీరముతో తామరపూవులవంటి చక్కని కన్నులతో ప్రియురాలగు శ్రీ లక్ష్మీదేవి చేత కౌగిలింపబడిన మూర్తితో నుండును.



**39** దీపస్తంభం, సిద్దిపేట

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను, చక్రమును, అట్లే ఎడమవైపున వరముద్రను, శంఖమును, నాల్గు చేతులతో ధరించి యుండును.

-- రూప ధ్యాన రత్నావళి - పు 212

అందువల్ల దీనిని ఒక ప్రత్యేక మూర్తిగా భావించవచ్చును.

అట్లే లక్ష్మీదేవి నృసింహస్వామి వామాంకంలో కాక వామభాగంలో ప్రక్కన కన్పిస్తుంది. వెనకనున్న ప్రభలో దశావతారాలు చెక్కబడ్డాయి. లక్ష్మీదేవి కింద ఒక భక్తుడున్నాడు.

దేవాలయంలోని తక్కిన శిల్పాన్ని దృష్టిలో ఉంచుకొని చూస్తే ఈ శిల్పం అర్వాచీనమైందని తోస్తుంది. లేక శిల్పి ప్రతిభా సంపన్నుడు కానట్లు కన్పిస్తుంది.

## దీపస్తంభం[PL-38]

ఇంకా దేవాలయానికి కొద్ది దూరంలో ఒక నిలువైన రాతి స్తంభముంది. ఇది సుమారు 40-45 అడుగుల పొడవుంటుంది. ఇది దీపస్తంభం కావచ్చు. నాటి దీపస్తంభాలు 30-50 అడుగుల పొడవుండి చివర ఒక వృత్తాకారపు శిలాఫలకం ధానిపైన నాలుగు సన్నని కురుచయైన రాతిస్తంభాలు ఆపైన చతురస్రాకారపు రాతి పలక ఉండేది. రాతి స్తంభాల మధ్య దీపాన్ని అమర్చేవారు. ఇది ఎత్తున ఉన్నందువల్ల ఊరికంతా కన్పించేది. ఇటువంటి దీపస్తంభాలు సిద్దిపేట[PL-39], పుల్లూరు, కొలనుపాక, ధర్మపురి మొదలైన చోట్ల కన్పిస్తాయి. ఈ స్తంభాలన్నీ దేవాలయాలకు ఎదురుగా లేక ఒక

ప్రక్కనున్నందువల్ల వీటిని ధ్వజస్తంభాలని చెప్పటకు వీలుపడదు.

బెజ్జంకి దేవాలయానికి సమీపంలో ఉన్న ఈ స్తంభం పై భాగాన వృత్తాకారపు శిలాఫలకం వగైరాలు కన్పించవు. ఇవి కాలగతిలో విరిగి పడిపోయి ఉండవచ్చు. లేకపోతే ఏ రాజో రాజ సామం తుడో తాను చేసిన యుద్ధ విజయానికి చిహ్నంగా ఏర్పాటు చేసిన విజయస్తంభమో స్పష్టంగా చెప్పలేము. ఆ స్తంభంపైన ఎటువంటి శాసనం చెక్కబడలేదు.

ఇవికాక దేవాలయానికి పశ్చిమంగా ఉన్న ఒక పెద్దనైన గుండుపై తొలచబడ్డ భైరవ విగ్రహం, దానికి ఉత్తరాన ఒక చిన్నగుడి, అందులో శివలింగం, గణపతి, దుర్గ విగ్రహాలు కన్పిస్తాయి. కాని ఇవి లక్ష్మీ నృసింహస్వామి దేవాలయమంత ప్రాచీనమైనవి కావు.

ఈ విధంగా బెజ్జంకి దేవాలయం కాకతీయులకాలంలో నిర్మించబడి ఆనాటి శిల్పకళకు నిలయమై పరమ మాహేశ్వరులైన కాకతీయ ప్రభువుల మత సామరస్యానికి చిహ్నంగా నేటికీ కన్పిస్తున్నది. పురావ స్తుశాఖవారు, పరిశోధకులు ఈ ప్రాంతంలో సమగ్రమైన పరిశోధనలు జరిపి అచ్చటి చారిత్రకాంశాలతో పాటు కళలకు సంబంధించిన అంశాలను ముఖ్యంగా తెలుగు నాట్యానికి సంబంధించిన విషయాలను వెలుతురులోకి తెస్తే బాగుంటుంది.

అట్లే చక్కని కాకతీయ శిల్పకళా సౌందర్యానికి ఆలవాలమైన దేవా లయాలు కళాదృష్టి, పురాతన వస్తువులపై ఆదరభావం లేని వ్యక్తుల నిరాదరణ, దుశ్చేష్టల వల్ల చెడిపోకుండ మన ప్రాచీన కళాఖండా

లను ఆదరభావంతో జాగ్రత్తపరచుకోవాల్సిన బాధ్యత ప్రతి భారతీయ పౌరునిపైనున్నదన్న విషయం మరువరానిది.

ఇతి శమ్

# ఉపయుక్త గ్రంథాలు


| | | |
|---|---|---|
| 1. | కందుకూరి ఈశ్వరదత్తుగారు | ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం. |
| 2. | గడియారం రామకృష్ణశర్మగారు | మనవాస్తు సంపద. |
| 3. | డా. కొండూరు వీరరాఘవాచార్యులు గారు | శిల్పకళాక్షేత్రాలు. |
| 4. | | విజ్ఞాన సర్వస్వం - తెలుగు సంస్కృతి I |
| 5. | S.M. గణపతిస్థపతి (ముఖ్యసంపా.) | రూపధ్యాన రత్నావళి |
| 6. | భారతి మాసపత్రికలు | |
| 7. | Dr. P.V. Parabrahma Shastry (Ed) | Inscriptions of A.P. Karimngar Dt. |
| 8. | Dr. Y. Gopal Reddy | The Ghanpur group of Temples |
| 9. | Ch. Prasad Rao | Kakatiya Sculpture |
| 10. | P. Sitapathi | Sri Ahobila Narasimha Swamy Temple |
| 11. | T.N. Srinivasan | A hand book of South Indian Images |
| 12. | Dr. M. Narasimaha chary | History of the cult of Narasimha in Andhra Pradesh. |
| 13. | | Journal of Telugu Studies |




